# శ్రీవైష్ణవ గ్రంథములు.

| | |
|---|---|
| ఆచార్య సూక్తి ముక్తావళి. | 2—8—0 |
| నిత్యానుసంధానం టీకాతాత్పర్యసహితం. | 2—4—0 |
| డిటో మూలం. | 0—8—0 |
| డిటో టీకా. | 1—2—0 |
| తత్వత్రియం టీకాతాత్పర్యం. | 1—8—0 |
| ముదలాయిరం. | 0—12—0 |
| తిరువాయిముడి | 0—12—0 |
| పెరియతిరుముడివ్యాఖ్యానము. అరుంబదలివిశక్కముతో. | 5—0—0 |
| నాలాయిరదివ్యప్రబన్ధము. | 2—8—0 |
| అష్టాదశ రహస్యములు. | 1—4—0 |
| ద్వాదశ రహస్యములు. | 0—10—0 |
| పెద్దస్తోత్రపాఠములు (78) | 1—0—0 |
| చిన్నస్తోత్రపాఠములు. (44) | 0—4—0 |
| శ్రీయామునందారుస్తోత్రము ప్రతిపద టీకాతాత్పర్యం | 0—6—0 |
| శ్రీయామునందార స్తోత్రవ్యాఖ్యానం. | 0—6—0 |
| గద్యత్రయం వ్యాఖ్యానము. | 0—10—0 |
| అష్టశ్లోకి వ్యాఖ్యానము. | 0—2—0 |
| తిరుప్పల్లాండు ప్రతిపద టీకాతాత్పర్యం. | 0—2—6 |
| 108 దివ్యతిరుపతుల వైభవం. | 0—3—0 |
| ముకుందమాల తాత్పర్యం. | 0—2—0 |
| యతిరాజవింశతి వ్యాఖ్యానము. | 0—3—0 |
| శ్రీవిష్ణు సహస్రనామములు. | 0—4—0 |
| శ్రీభగవద్గీత శ్రీమద్రామానుజాచార్యులవారి భాష్యమునను సరించిన తెనుగు ప్రతిపద టీకాతాత్పర్యం. | 1—4—0 |
| రత్నకోశం ప్రతిపద టీకాతాత్పర్యం. | 0—2—0 |
| ...లం. | 0—4—0 |

# పీఠిక.

---

శ్రీవైష్ణవ విశిష్టాద్వైతసిద్ధాంతమును గుఱించిన గ్రంథములాంధ్రమునందంతగ గానరావు. సంస్కృతభాషయందున్నను నవి జనసామాన్యమునకు దురవగాహములగుటవలన నీమతము సకలజనులకు తెలియఁబడుచుండలేదు. మనయాంధ్రభాషకన్న ద్రావిడభాషయందు, బెక్కు గ్రంథములు వ్రాయబడియున్నవి. ఏభాషయందెట్టి గ్రంథములున్నను మనయాంధ్రభాషయందు లేమిం జేసి యితరభాషా పరిచయము లేనివారి యుపయోగార్థమై యీగ్రంథమాంగ్లేయభాషనుండి యాంధ్రీకరింపఁబడినది. ఈమతసిద్ధాంతములను పాశ్చాత్యులకుఁ దెలుపవలెనని దివ్యజ్ఞానసమాజాధ్యక్షులగు కర్నల్ ఆల్కాట్ దొరగారికోరికమీద శ్రీమాన్ సదాదూరి భాష్యాచార్యులను మహాపండితులొకరు ప్రశ్నోత్తరరూపముగనుండిన నెల్లవారికిఁజక్కగ సుభోధమగునను సదుద్దేశ్యముతో మొట్టమొదట నీగ్రంథమును నాంగ్లేయభాషయందు విరచించిరి. చెంగల్పట్టు మండలములోని శ్రీపెరుంబూదూరియందు క్రీ.శ.౧౮౩౯వ సంవత్సరమున జన్మించిరి వీరు శ్రీరామానుజాచార్యులవారితోఁబుట్టువుకొమారుడగు వరదవిష్ణుమిశ్రునకి_౨౮గవతరమున జేరినవారు. వీరుయజుర్వేదమును బాల్యమునందే యభ్యసించిరి. తదనంతరము విద్వాన్ గోపాలాచార్యులవారి వద్దను, మైసూరుసంస్థానమునందు పండితులుగనుండిఖ్యాతినొందిన అనందాళ్వానువద్దను ప్రస్తుత శృంగేరీపీఠాధిపతుల తండ్రిగారగు రామశాస్త్రిగారివద్దను న్యాయశాస్త్రము మొదలగునవి నభ్యసించుచు చెన్నపురి యందు చంద్రనారాయణ భట్టాచార్యులవారి శిష్యులగు బుబ్లి జగన్నాథశాస్త్రిగారివద్ద న్యాయశాస్త్ర సంబంధములగు గదాధరకృత గ్రంధములఁ బఠించి ముగించిరి. అటుపిమ్మట (అనగా) యిరువదినాల్గవయేట కాంచీనగరమునకుఁ బోయి శ్రీరంగరామానుజులను యతీశ్వరులవద్ద వేదాంత విద్యాభ్యాసమునకు దొరకొని యద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతము.. జక్కగనేర్చుకొనిరి. ౧౮౬౦ సంవత్సరమునందీయతీశ్వరులు
నకు సమీపమునందున్న తిరువెంధిపురమునకు విజయ (అపరిమి

ష్యాచార్యులవారుగూడ వచ్చియుండగ ఆయతీశ్వరులొకనాడు పూర్వాచారపరాయణులును శుద్ధశ్రోత్రియులునగు వైష్ణవులనేకులయెదుట త్రీర్థవినియోగకాలమందు మొదటనీయగ వారద్భుతపడి ఇదియేమి? లౌకికునకిట్టిసన్మానము జరుగవచ్చునాయని సంశయపడుచుండగ వారలనుగాంచియాయతీశ్వరులు "మీరీభాష్యాచార్యులవారెవరనుకొన్నారు వరదగురువులవారిసంతతిలోనివారు వీరినినేను రెండవ శ్రీరామానుజాచార్యులనుగ భావించుచున్నాను" అనిపలికిరట. గురువువారి యాజ్ఞప్రకారము భాష్యాచార్యులవారు శ్రీవేదాంతాచార్యకృతమగు రహస్యత్రయసారమునకు వ్యాఖ్యవ్రాయనారంభించి పదునెనిమిది యధ్యాయములనుమాత్రము ముగించిరి. వీరిస్వభాషద్రావిడము. వీరులౌకికోద్యోగమునందున్నపుడే ఆంధ్రము, హిందీ, హిందూస్తాని కన్నడము, మహారాష్ట్రము బంగాళి, పారశీకము. అరబ్బిభాషలుమాత్రమే కాక రాజకీయభాషయగు నాంగ్లేయభాషంగూడనభ్యసించిరి. వీరు ౧౮౭౦ సంవత్సరము మొదలుకొని కడప, బల్లారిమండలన్యాయస్థానములందు న్యాయవాదివృత్తిం గైకొనియుండిరి. ౧౮౮౬ వ సంవత్సరమునందు దివ్యజ్ఞానసమాజమందు ప్రవేశించిరి. ఆసమాజమునందున్నపుడె వీరీచిన్నగ్రంథమున్వ్రాసిరి ఆసమాజమునందుం ప్రవేశించినతరువాత వారిమతాభిప్రాయములు మారినవి. అందువల్లనే వీరలు తమపీఠికయందు "నేనీగ్రంథమును శ్రీరామానుజార్యకృతములగు సంస్కృతగ్రంథములను వారిభాష్యమును ననుసరించి వ్రాసితినేకాని నాయొక్కయు, నాసమాజములోనివారియొక్కయు నభిప్రాయముల ననుసరించి యీగ్రంథము వ్రాయలేదు అంతియగాక విశిష్టాద్వైత సిద్ధాంతమునకు సంబంధములేనియితర సిద్ధాంత సంగతులనిమిడ్చియుండలేదు "అనివ్రాసిరి. వీరుసాహిత్యకల్లోలిని, చంద్రరేఖ, ఆశోపాలంభశాంతిస్తుతి వరవర్ణిని, వర్ణసమణిదర్పణము మొదలగుగ్రంథములురచించి ౧౮౮౯ సంవత్సరము నందు (తమ ౫౪ సం॥ నందు) దేహవియోగమును గాంచిరి.

ఇట్టిమహావిద్వాంసులచేత వ్రాయంబడిన యీగ్రంథము కేవల ..యభాషయందుండుటచేత తద్భాషాపరిచితులగు వారికే గాని హూణభాషాపరిచితులుగాని యాంధ్రులకును

యోగించనందున దీనినాంధ్రీకరింపఁదలంపుఁ గలిగినామిత్రులును ఇక్క
డకొంతకాలము హిందూపాఠశాలలో ప్రధానోపాధ్యాయులుగను త
రువాత నూజివీడు శనివారప్పుపేట సంస్థానపాఠశాలలో సహాయోపా
ధ్యాయులుగనుండిన శ్రీ రాళ్ళపల్లి- కొండలరాయఁడుగారు తాము జా
డ్యపీడితులై స్వస్థత లేకుండియు శ్రమపడి దీనిం దెలిగించిరి వీరు విశిష్టా
ద్వైతమతావలంబకులై యుండియు తమ సత్యసంధత మొదలగు సద్గుణ
ముల చేతను సత్ప్రవర్తనముల చేతను వీరు వారను విచక్షత లేకుండ యెల్ల
మతముల వారి చేతను గౌరవింపఁబడుచుండిరి. తమమిత్రులు తమకెట్టి
మంచియుద్యోగము లిప్పించెదమన్నను నిరాకరించి తమసత్ప్రవర్తనము
నకు భంగము కలుగునని యెంచి యుపాధ్యాయపదవి నాశించి ఎట్టి దైన్య
స్థితిలో నున్నను ధనాశాపరులు గాక నున్న దానితోనే సంతుష్టినొందినా
రాయణస్మరణఁ జేయుచు తమ గ్రంథమచ్చుపడకపూర్వమే జీవయాత్ర
నుముగించిరి. లోకోపకారార్థమై తెలిగింపఁబడిన యీ గ్రంథము వారి
మరణానంతరము మూలఁబడుటఁ గాంచి యెట్లైనఁ దీనిఁ బ్రకటించి పు
రుషార్థము నొందుటయును మిత్రధర్మమును గాపాడఁదలంచి యచ్చొత్తిం
చితిని (అని మాడభూషి రంగాచార్యులవారు వ్రాసియున్నారు.)

అవరిమి
ందు వారియుప

# పీఠిక.

(రెండవకూర్పు)

నామిత్రులందరు "శ్రీవైష్ణవవిశిష్టాద్వైత సిద్ధాంతసారసంగ్రహ ప్రశ్నోత్తరమాలిక" యను గ్రంథమిప్పుడిచ్చటనుఁగానరాకున్నది. గాన మీరెట్లయిన యేతద్గ్రంథమును వెదకి సంపాదించి యుచ్ఛాపించవలసినదని ప్రోత్సాహపరచినందున సదరు గ్రంథకర్తలెవరో తెలియక చాలాశ్రమపడి తుదకెట్లకో భగవత్సంకల్పమువలన వారిని కనుగొంటిని. సదరు గ్రంథకర్తగారి సోదరులగు మ॥ రా॥ శ్రీ రాళ్ళపల్లి నాగభూషణంగారివలన యేతద్గ్రంథము యొక్క వారసత్వపుహక్కున్ను, కాపీరైటు హక్కును ది 14-3-1915 తేదిని పొంది ఎటులయిన నచ్ఛాపింప వలయునని పేపరుధరలు జాస్తి యయినను శ్రమపడిపూర్తిచేయించితిని చదువరులిందలి గుణములను గ్రహించి దప్పులున్న మన్నించెదరుగాకయని కోరుచున్నాడను.

ఇట్లు,

ఏలూరు.

కర్రా వేంకటరత్నము,

బుక్సెల్లరు.



శ్రీమతే రామానుజాయనమః.

# శ్రీ వైష్ణవ

## విశిష్టాద్వైతసిద్ధాంతసారసంగ్రహ

# ప్రశ్నోత్తరమాలిక.

గురుశిష్యసంభాషణము.

౧॥ శిష్యునిప్రశ్నము. ఆచార్యవర్యా! విశిష్టాద్వైతసిద్ధాంతము ను కృపచేసి నాకుబోధింపుఁడు. (ఉపదేశింపుఁడు.)

ఆచార్యుని ఉత్తరము విశిష్టాద్వైతసిద్ధాంతము శైవవిశిష్టాద్వైతమని, వైష్ణవవిశిష్టాద్వైతమని రెండుశాఖలతోఁగూడి యుండును. నీకేదిబోధింపవలెను.

౨ ప్ర॥ నాతండ్రిగారవలంబించిన మతశాఖను నాకుబోధింపుఁడు?

ఉ॥ శ్రీరామానుజాచార్యులవారిచే నుద్ధరింపఁబడిన వైష్ణవ విశిష్టాద్వైతమును మీతండ్రిగారవలంబించిరి.

3 ప్ర॥ అట్లగుచో శైవవిశిష్టాద్వైతమనునదేమి?

ఉ॥ అది శ్రీకంఠశివాచార్యులవారిచే బోధింపఁబడిన యొకానొక విశిష్టాద్వైత సిద్ధాంతము. ఈరెంటికిఁగల భేదమేమనఁగా (శ్రీరామానుజాచార్య మతావలంబులు) వైష్ణవవిశిష్టాద్వైతులు దేవతలందరిలోను విష్ణుప్రాధాన్యము నంగీకరింతురు. ఇట్లగనే శైవవిశిష్టాద్వైతులు శివప్రాధాన్యమునంగీకరింతురు.

౪ ప్ర॥ శ్రీరామానుజాచార్యులెవరు?

ఉ॥ ఆయన అనంతుఁడను శేషునియొక్క యవతారము.

౫ ప్ర॥ ఆయన యెచ్చోట నవతరించిరి?

ఉ॥ ఆయన చెన్నపురంబునకుఁ బడమర నిరువదియామడల దూరమునందున్న చెంగల్పట్టుమండలములోని భూతపురియని బిలువఁబడు శ్రీపెరుంబూదూరియందు నవతరించిరి. (అవరిమి

౦దు వారియుప

౬ ప్ర॥ వారియవతారకాలమెద్ది?

ఉ॥ ఆయన కలియుగాది ౪౧౧౮ సంవత్సరమగు పింగళనామ సంవత్సర చైత్రశుద్ధ పంచమి గురువారమున కర్కాటకలగ్నమున ఆర్ద్రానక్షత్రమం దవతరించిరి. (క్రీస్తుశకము ౧౦౧౭).

౭ ప్ర॥ వారికుటుంబమునుగురించి నాకుఁ జెప్పుఁడు?

ఉ॥ ఆయన ఆపస్తంబసూత్ర హారితసగోత్రుడైన యజుర్వేది. ఆయన తండ్రిగారిపేరు కేశవసోమయాజి ఆయన తల్లిగారిపేరు కాంతిమతీదేవి

౮ ప్ర॥ ఆయన శేషావతారముని చెప్పుటచే దానితాత్పర్యమేమి?

ఉ॥ శ్రీవాసుదేవాజ్ఞను జేసి శేషునియాత్మ ఆయన మానవశరీరమును నావేశించియుండునని దానిభావము. (శేషుఁడు మానవశరీరధారణచేయుట.)

౯ ప్ర॥ అనంతుఁడను శేషుఁడు శ్రీరామానుజాచార్యులుగా నవతరించుటకుఁ గారణమేమి?

ఉ॥ నిజమగు (సత్యమగు) వేదాంతతత్వమును (చేతనుల నుజ్జీవింపజేయుటకై) బోధించుటకు.

౧౦ ప్ర॥ ఆయనయెక్కడ విద్యాభ్యసించిరి?

ఉ॥ ఉపనయనమైనతరువాత పదునేనవవత్సరముదనుక ఆయన స్వగృహమందే విద్యనభ్యసించిరి. అప్పుడు ఆయనతండ్రిగారి మరణానంతరము శ్రీపెరుంబూదూరినివిడిచి కాంచీనగరమునుఁ బ్రవేశించిరి.

౧౧ ప్ర॥ ఆయనయెవరివలన విద్యనభ్యసించిరి?

ఉ॥ ఆయనకు పదునేనవసంవత్సరము వచ్చువరకును ఆయన తండ్రిగారు ఆయనకు వేదవేదాంగముల నుపదేశించిరి. ఇకను కాంచీనగరమున విశేషవిద్యాకీర్తులుగల యాదవప్రకాశమిశ్రుఁడను యతి దగ్గర (ఆయన) నానావిధములగు తత్వసిద్ధాంతములను జదివిరి.

౧౨ ప్ర॥ యాదవప్రకాశకులేతత్వసిద్ధాంతమునవలంబించిరి?

ఉ॥ ఈయన మొదట శ్రీశంకరాచార్యులవారి మతావలంబకు లుండిరి గాని తరువాతను శంకరమతమునకు నీషద్భేదమును ంబించిన యద్వైతియయ్యెను ఈయనయభిప్రాయములు శిష్యులచే నంగీకరింపఁబడవయ్యెను.

౧౩ ప్ర॥ ఆయన యేమైన గ్రంధములు వ్రాసిరా ?

ఉ॥ శ్రీశంకరాచార్యులవారు వ్రాసినదానికంటె భిన్నముగా బ్రహ్మసూత్రములకు భాష్యమును విరచించిరి.

౧౪ ప్ర॥ శ్రీరామానుజాచార్యులవారు తమగురువు యొక్క యభిప్రాయముల నవలంబించినారా ?

ఉ॥ లేదు.

౧౫ ప్ర॥ అట్లగు నేని ఆయన యెవరిమతసిద్ధాంతములనవలంబించిరి.

ఉ॥ ఆయన తనకుముందు పరంపరగావచ్చుచుండిన పూర్వాచార్యులచే నుపదేశింపఁబడిన విశిష్టాద్వైతసిద్ధాంతమునవలంబించిరి.

౧౬ ప్ర॥ వారలెవ్వరు?

ఉ॥ వారలెవ్వరనగా (౧) భగవద్బోధాయనులు (౨) ద్రమిడాచార్యులు (3) బ్రహ్మనంది (అనగా టంకాచార్యులు) (౪) గుహదేవాచార్యులు (౫) ఆచార్యభారుచి (౬) ఆచార్యకపర్ది (౭) శ్రీనాధముని (౮) శ్రీయామునాచార్యులవారు.

౧౭ ప్ర॥ ఆయన యాదవప్రకాశకులవద్దఁజదివికొనియు వారి యొక్క మతాభిప్రాయములఁ దామేలయంగీకరింపకపోయిరి?

ఉ॥ ఏలయన యాదవప్రకాశక ప్రతిపాదితార్థములు శ్రుతులకును పూర్వాచార్య గ్రంధములకును విరుద్ధములై నట్లుగ్రహించిరి.

౧౮ ప్ర॥ దీనినిగని పిమ్మట యాయన యేమిచేసి ?

ఉ॥ ఆయన యాదవప్రకాశకునితో వాదించి వారిసిద్ధాంతముని రాకరించి సరిపడక వారినివిడిచిపెట్టిరి

౧౯ ప్ర॥ ఆయన యొక్కడకు నెవరియొద్దకువెళ్లిరి?

ఉ॥ శ్రీరంగము (తిరుచనాపల్లిమండలములోనిది) నందు శ్రీయామునాచార్యులవారను వైష్ణవయతి విశిష్టాద్వైతసిద్ధాంతమును బోధించుచున్నందున నచ్చటికివిజయంచేసిరి.

౨౦ ప్ర॥ యామునాచార్యులవారి మతసిద్ధాంతస్వభావమెట్టిది ?

ఉ॥ ఆయన బోధాయన ద్రమిడాచార్యులువారల కనుగుణ్యముగానుండు విశిష్టాద్వైతసిద్ధాంతమునుబోధించెను.

౨౧ ప్ర॥ శ్రీరామానుజాచార్యులువారు శ్రీరంగ(మవరిమి న పిమ్మట నేమిచేసిరి?

దు వారియుప

ఉ॥ శ్రీయామునాచార్యులవారు పరమపదమునకు వేంచేసిరని తెలుసుకొనుటచేత వారిశిష్యులలోనుత్తములైన పెరియనంబియనుమహాపూర్ణాచార్యులను తమకు గురువుగా నంగీకరించి చెంగల్పట్టుజిల్లాలోని మధురాంతకమునందు శ్రీరామానుజాచార్యులవారు వైష్ణవసిద్ధాంతము నుపదేశమును పొందిరి.

౧౨ ప్ర॥ దీనితరువాత వారేమి చేసిరి?

ఉ॥ వారుభయులును కాంచీపురంబునకు వెళ్ళి యక్కడ గురువుశిష్యునికి (శ్రీరామానుజాచార్యులవారికి) బోధాయనఋషి మొదలగువారి లేఖనములతోఁగూడ విశిష్టాద్వైతసిద్ధాంతమును ఉపదేశించెను.

౧౩ ప్ర॥ శ్రీరామానుజాచార్యులువారు గృహస్థులేనా?

ఉ॥ ఆయన వివాహముఁ జేసుకొనిరిగాని ఆయనయొక్క పదునెనిమిదవ యేటగృహస్థాశ్రమమును వదలి కంచియందు త్రిదండసన్యాసమునుఁ బుచ్చుకొనిరి.

౧౪ ప్ర॥ ఆయనయెంతకాలము జీవించిరి?

ఉ॥ ఆయన ౧౨౦ సంవత్సరములు జీవించి కలియుగము యొక్క ౪౨౩౮వ సంవత్సరమున మోక్షమునొందిరి. (౧౧౩౭ క్రీ.)

౧౫ ప్ర॥ ఆయనయెక్కడ పరమపదమునొందిరి?

ఉ॥ శ్రీరంగమునందు. వారిపావనశరీరము శ్రీరంగనాథాలయములో నొకానొకచోట భూస్థాపన చేయఁబడి యచ్చట వారివిగ్రహముసిప్పుడును పూజింపఁబడుచున్నది.

౧౬ ప్ర॥ సన్యసించినతరువాత ఆయనయేమి చేసిరి?

ఉ॥ ఆయన యనేక శిష్యులకునుపదేశించుచు కాంచీనగరంబున కొంతకాలము వరకునుండిరి. ఇక్కడనుండి తిరుపతికి వెళ్ళిరి.

౧౭ ప్ర॥ ఆయనతిరుపతియందేమి చేసిరి?

ఉ॥ ఆయనయెగువతిరుమలయందు శ్రీవెంకటేశ్వరాలయములో వేదాంతమునుగూర్చి యనేకయుపన్యాసములనిచ్చిరి అచ్చట శ్రీవెంకటేశ్వరస్వామివారికి తిరిగి యర్చనాదికము నేర్పరచిరి.

౧౮ ప్ర॥ తిరుపతినుండియెక్కడకు వెళ్లిరి?

ఉ॥ [illegible]దేశంబున పుణ్యక్షేత్రములందును విష్ణ్వాలయములం

౩౭ ప్ర॥ తిరునారాయణపురంబున నెంతకాలముండిరి ?

ఉ॥ ఆపట్టణంబున పండ్రెండువత్సరంబులుండిరి. అంతటక్రిమికంఠచోళుని మరణమునుగురించివిని శ్రీరంగమునకువెళ్ళి యచ్చటనా మహాస్థలంబున మరలనర్చనాదికము నేర్పరచిరి.

౩౮ ప్ర॥ ఆయనదక్షిణహిందూస్థానమందేమతముభోధించిరా ?

ఉ॥ లేదు. తమ శిష్యులతోఁగూడ ఆయన తిరుపతి అహోబలము మహారాష్ట్రదేశముల మార్గమున ఉత్తరహిందూస్థానమునకును వెళ్ళి ఆయనవెళ్ళిన ప్రతిస్థలమందును బోధించిరి.

౩౯ ప్ర॥ ఉత్తరహిందూస్థానంబునందు నేయేక్షేత్రములజూచిరి

ఉ॥ ఘూర్జరదేశంబునందలి దత్తాత్రేయక్షేత్రమును గిరినారును ద్వారకనుసేవించి యటనుండి ప్రయాగ వారణాసి మధుర హరిద్వారములకువెళ్లిరి.

౪౦ ప్ర॥ హరిద్వారమునుండి యెక్కడికి వెళ్లిరి ?

ఉ॥ హిమాలయంబులందలి (బదరినాద్) బదరికాశ్రమమునకును అక్కడనుండి కాశ్మీరమునందలి శ్రీనగరమునకునువెళ్లిరి.

౪౧ ప్ర॥ ఆయన శ్రీనగరమునందేమిచేసిరి ?

ఉ॥ గొప్పవిద్యాస్థానమును అనేక గ్రంథభాండాగారంబునగు శారదాపీఠంబును (సరస్వతీపీఠంబునుఁ) జూచి తత్స్థలంబునకు తామురచించిన గ్రంథములప్రతులు నొసంగెను. ప్రబలవాదము జరిగినమీదట నచ్చటిపండితులంగీకరించి యాగ్రంథములు గైకొనిరి.

౪౨ ప్ర॥ వారికిశారదాపీఠంబున లభ్యమైనవిశేషమేమి ?

ఉ॥ దివ్యజ్ఞానాధిదేవతయగుసరస్వతి ఆయనకుదర్శనమిచ్చి ఆయనను వేదాంతార్థంబులందనేకంబులగు కఠినప్రశ్నంబులడిగి యాయన చెప్పిన సదుత్తరములచేమిగుల నానందించి ఆయనకు శ్రీభాష్యకారులను బిరుదునొసంగి శ్రీహయగ్రీవమూర్తి విగ్రహమొకదానినొసంగెను. నాటనుండియుశ్రీరామానుజాచార్యులవారుభాష్యకారులనిపిలువఁబడిరి.

౪౩ ప్ర॥ శారదాపీఠంబునుండి వారెచ్చటికివెళ్ళిరి ?

నుండి ఉ॥ ఆయన కురుక్షేత్రముమీదుగా అయోధ్యకును గయాపట్టణ
మునకు అటనుండి కాశీపట్టణమునకు దక్షిణంబుననుండు (సాండర్బం
ఆశ్రమమునుఁ జూచుటకై వంగదేశములోనికివెళ్లిరి

౪౪ ప్ర॥ కపిలాశ్రమమునుండి వారెచ్చటికి వెళ్ళిరి?

ఉ॥ ఆయన శ్రీజగన్నాధపురమునకును, తూర్పు సముద్రతీరము నందలి యితర పుణ్యక్షేత్రములకును వెళ్ళి చివరకు తమయాత్రను శ్రీరంగమున ముగించిరి.

౪౫ ప్ర॥ ఆయన చేసిన యాత్రలన్నియు నివియేనా ?

ఉ॥ లేదు రెండుమారులు (ఆసేతు హిమనవంతముదనుక) హిందూస్థానమంతటను యాత్రచేసి ప్రతిచోటను తనమతమును బోధించుచు అనేకశిష్యులకు నుపదేశించుచు వచ్చిరి. ఉత్తరహిందూస్థానమును రెండవమారు చూచినతరువాత, శ్రీరంగమునందు ప్రవేశించి పరమపదించువరకు నచ్చటనేయుండిరి.

౪౬ ప్ర॥ శ్రీనగరమునందలి పుస్తకభాండాగారమునకే యే గ్రంథములొసగిరి?

ఉ॥ వారురచించిన గ్రంథములన్నియు నివి.

౧ విశిష్టాద్వైతసిద్ధాంతానుగుణ్యముగా శ్రీబాదరాయణకృతమగు బ్రహ్మసూత్రములకు గొప్పవ్యాఖ్యానమగు శ్రీభాష్యము-దీనియందు నితరమతసిద్ధాంతములను ముఖ్యముగా శ్రీశంకరాచార్య సిద్ధాంతమును ఖండించిరి.

౨ వేదాంతదీపము-బ్రహ్మసూత్రములకు కొద్దివ్యాఖ్యానము.

౩ వేదాంతసారము-ఇది బ్రహ్మసూత్రములకు లఘువ్యాఖ్యానము.

౪ వేదార్థసంగ్రహము-ఇదియుపనిషత్సంబంధమైన గ్రంథము.

౫ గీతాభాష్యము-ఇది శ్రీభగవద్గీతాభాష్యము.

౬ గద్యత్రయము-ఇదివారిశిష్యులయుపయోగార్థముగా రచింపఁబడిన శ్రీమన్నారాయణస్తోత్రరూపమగు వచనకావ్యము.

౭ నిత్యగ్రంథము-ఇది శ్రీమన్నారాయణునికినిత్యార్చనాది నియమములుగలది వీనిలో శ్రీభాష్యమును వేదార్థసంగ్రహమును, శ్రీగీతాభాష్యమును, శారదాపీఠమునందలి పుస్తకశాలకనొసగిరి.

౪౭ ప్ర॥ శ్రీరామానుజాచార్యులవారికి (అనుచరులు) శిష్యులు విశేషముగానుండిరా ?

ఉ॥ వారిజీవితకాలమందు వారిశిష్యులువిశేషముగా-(అపరిమితముగా) నుండిరి. ఒకానొకకాలంబున శ్రీరంగమునందు వారియుప

న్యాసముల నిచ్చియుండిన శిష్యులు, ఏభువందల సన్యాసులును, పరమైకాంతులను పన్నెండువేలగృహస్థులును, తమిళ్నందు కొత్తిమలను ఐదువందలసన్యాసినులును, సాధారణముగా విరాగులను చాతనులుఅను బ్రాహ్మణేతర వైష్ణవులు అనేకముగా లెక్కదేలిరి.

౭౦ ప్ర॥ తమమత వ్యాపనమునకై స్వయముగా బోధించుటయేగాక ఆయన యేపనుల చేసెను?

ఉ॥ తమశిష్యులలో డెబ్బదినలువుర ప్రబలపండితులను బోధించుటకును ఉపదేశించుటకును ఆచార్యపురుషులను పీఠాధిపతుల నేర్పరిచెను.

౭౧ ప్ర॥ శ్రీరామానుజాచార్యులవారు పరమపదించిన వెనుక గురుపారంపర్యము యెట్లుజరుగుచువచ్చెను?

ఉ॥ డెబ్బదినలుగురుఆచార్యపురుషులును గృహస్థులయ్యుండిరి. గనుక వారిసంతతివారుగాని లేకసరియగుసంతతిలేనియెడల యితరజ్ఞాతిపరంపరవారుగాని శ్రీవైష్ణవులలో గురుత్వమునుపొందుచునుందురు.

౭౨ ప్ర॥ విశిష్టాద్వైత సిద్ధాంతగురుపరంపర శ్రీశంకరాచార్యులవారి యొక్కయు, శ్రీమధ్వాచార్యులవారియొక్కయు మతస్థులగురుపరంపరనుండి భేదించియుండునా?

ఉ॥ అవును. ఈయుభయ మతస్థాపకులు మఠముల నేర్పరచియే తన్మఠాధిపతులు శ్రీశంకరాచార్య మధ్వాచార్యనామములవహించవలసియుండినట్లుగా చెప్పియున్నదిగాని శ్రీరామానుజాచార్యులవారు అట్టి మఠములస్థాపించియుండలేదు.

౭౩ ప్ర॥ శ్రీరామానుజాచార్యులవారియొక్క శిష్యులలో కొందరిపేర్లను నాకు తెలిపెదరా?

ఉ॥ ముఖ్యులగువారిలో శ్రీవత్సాంకమిశ్రులును అనేకగ్రంథములనురచించిన ఆయనకుమారుడైన భట్టపరాశరులును; వరదవిష్ణుమిశ్రులును శ్రీరామమిశ్రులును సేనేశ్వరాచార్యులవారును శ్రీవిష్ణుచిత్తాచార్యులును వీరలయ్యుండిరి. ఈచివరినలుగురును అనేకవేదాంతగ్రంథములను రచించుటయేగాక శ్రీరామానుజాచార్యవిరచితగ్రంథములకు అనేకవ్యాఖ్యానములను గూడవ్రాసిరి.

౭౪ ప్ర॥ శ్రీరామానుజాచార్యులవారు పరమపదించినవెనుక ఆయనమతస్థులలో ప్రసిద్ధపురుషులెవరయినుండిరా?

ఉ॥ ఉండిరి. శ్రీభాష్యవ్యాఖ్యానకర్తయగు వ్యాసాచార్యులును అనేకతత్వశాస్త్రములను రచించినట్టియు దక్షిణహిందూస్థానమున గొప్పకవిశేఖరునైన వేదాంతాచార్యులును విశిష్టాద్వైతసిద్ధాంత గ్రంథములను రచించి ప్రసిద్ధిఁజెందిన మహాచార్యులును భావప్రకాశ, దశోపనిషద్భాష్య, విషయవాక్యదీపిక, రామానుజసిద్ధాంతసారసంగ్రహములను దివ్యప్రబంధముపై పదివేలగ్రంథముచే నొకసంస్కృతభాష్యమును విరచించిన శ్రీరంగరామానుజాచార్యులును—

౫౩ ప్ర॥ ఈమహాపురుషులు యెప్పుడుజీవించియుండిరి?

ఉ॥ వ్యాసాచార్యులవారును వేదాంతాచార్యులవారును ౧౩ వశతాబ్దమునందును, మహాచార్యులవారు శ్రీరంగరామానుజాచార్యులవారును ౧౫ వశతాబ్దమునందును ప్రసిద్ధిగాంచిరి.

౫౪ ప్ర॥ శ్రీరామానుజాచార్యులవారి మతస్థులలో యేమైన భేదములుగలవా?

ఉ॥ కలవు. వడగలై, తెంగలై అనురెండువిధములుగలవు.

౫౫ ప్ర॥ వడగలై వారిముఖ్యలక్షణములేవి?

ఉ॥ వారువేదములను శాస్త్రములను శ్రీభాష్యమును యెక్కువగా గౌరవింతురు. ఊర్ధ్వపుండ్రమును తెల్లనిచిహ్నమును పాదములేక యేధరింతురు.

౫౬ ప్ర॥ తెంగలెవారిముఖ్యలక్షణంబులెవ్వి?

ఉ॥ వీరుశ్రీభాష్యము మొదలగు సంస్కృతవేదాంతగ్రంథములకంటెను నాలుగువేలపాశురములతోనొప్పుచు దివ్యప్రబంధము అనిపిలువఁబడు ద్రావిడవేదమును భగవద్విషయ మనిపిలువఁబడు ద్రావిడవేదభాష్యమును ఎక్కువగా గౌరవింతురు. వీరియూర్ధ్వపుండ్రము పాదముతోఁగూడియుండును.

౫౭ ప్ర॥ వడగలైవైష్ణవులట్లు పిలువఁబడుటకు గారణంబేమి.

ఉ॥ ద్రావిడభాషయందు వడ + కలై = ఉత్తర లేకసంస్కృతభాష యనునట్టివడగలైవైష్ణవులు, సంస్కృత తత్వగ్రంథముల నెక్కువగ గౌరవించుటంజేసియు కాంచిక్షేత్రంబున ౧౩ వశతాబ్దమునందవతరించి యచ్చటను, కొంతకాలము శ్రీరంగమందును,గూడలూరుసమీపస్థము గు తిరువెంది పురమునందును, నివసించియుండిన వేదాంతాచార్యులు

వారిచే దెలుపఁబడిన రహస్యములందుం జెప్పంబడిన ధర్మములనవలంబిం చుటం జేసియు వడకలై యనఁ బిలువఁబడుదురు.

౧౮ ప్ర॥ తెంగలై వైష్ణవులిట్లు పిలువఁబడుటకు కారణమేమి?

ఉ॥ ద్రావిడంబున తెన్ + కలై = దక్షిణపు లేక తమిళ్ గ్రంధము అనియర్థమిచ్చు తెంగలై వైష్ణవులు దివ్యప్రబంధము నెక్కువగ గౌరవించు టం జేసియు, ౧౩వ శతాబ్దమున శ్రీరంగమునందు జీవించియుండిన లోకాచార్యులవారిచేఁ దెలుపఁబడిన రహస్యములందును, తిరునల్వేలీమండలములో కుంతీనగర గ్రామంబునబహుశః పదునాలవశతాబ్దమునందు జీవించియుండిన మనవాళమహామునులవారిచే నొనర్పఁబడిన పైనఁ జెప్పినరహస్యముల ద్రావిడవ్యాఖ్యానములయందునుఁ జెప్పఁబడిన ధర్మములనవలంబించుటం జేసియు తెంగలై వైష్ణవులని పిలువఁబడుదురు

౧౯ ప్ర॥ ఈవిభాగములెంత కాలమునుండి యేర్పడియున్నవి?

ఉ॥ ఈనాలుగువందలసంవత్సరములనుండియు కలిగియున్నవి.

౨౦ ప్ర॥ దివ్యప్రబంధమనగా నేమి?

ఉ॥ శ్రీరామానుజాచార్యులవారికంటె పూర్వమందు జీవించియుండి ద్రావిడంబున ఆళ్వారులనఁ బిలువఁబడు బ్రాహ్మణులును తదితరులునగు విష్ణుభక్తులచే రచింపఁబడిన తమిళ్ పద్యముల సముదాయము దివ్యప్రబంధము నాఁబడును. వారివిగ్రహములు దక్షిణహిందూస్థానమునందలి విష్ణ్వాలయములలో వర్ధింపఁబడును, ఆభక్తులలో శ్రీశఠగోపులొకరు.

౨౧ ప్ర॥ శ్రీశఠగోపులేమిచేసిరి?

ఉ॥ నమ్మాళ్వారనిగూడఁ బిలువఁబడు శ్రీశఠగోపులు మిగుల గౌరవనీయుఁడైన యొకయోగియనగా మహాత్ముఁడు. తిరునల్వేలిజిల్లాలో దామ్రపర్ణీనదీతీరములందుండు నాళ్వారుతిరునగరిలో జీవించిరి. వారిచే రచింపఁబడిన యొక్క వైష్ణవగ్రంధము తిరువాయిమొళి. ఇది వేయిశ్లోకములుగలిగి దివ్యప్రబంధమున నిమిడియున్నది. ఈగ్రంధము శ్రీవైష్ణవులందరిచేత నెక్కువభక్తిపూజ్యతలతో గౌరవింపఁబడును

౨౨ ప్ర॥ దివ్యప్రబంధమున నేమియుండును?

ఉ॥ అది శ్రీమన్నారాయణుని స్తోత్రములతోఁగూడిన వేదాంతసారాంశములచే నొప్పియుండును.

౨౩ ప్ర॥ శ్రీవైష్ణవశబ్దార్థమెట్టిది.

ఉ॥ దేవతలందరిలో విష్ణువునకు నాధిక్యతనిచ్చువారు వైష్ణవులు. ఈశబ్దము మధ్వాచార్యమతస్థులగు మధ్వులు, శ్రీవల్లభాచార్యమతస్థులు, చైతన్యమతస్థులు, మొదలగువారితోఁగూడ దాదాపుగా నిరువదిశాఖలతోనొప్పియుండు. శ్రీవైష్ణవశబ్దము కేవలము శ్రీ రామానుజాచార్యులవారిమతస్థులకేఁ జెప్పనగును. వడగలె తెంగలెవైష్ణవులుభయులును సామాన్యముగా నీనామముచేతనే పిలువఁబడుదురు

౨౮ ప్ర॥ శ్రీవైష్ణవులుత్తర హిందుస్థానమున నేమనిపిలువఁబడుదురు?.

ఉ॥ వారుశ్రీసాంప్రదాయులని యచటఁబిలువఁబడుదురు.

౨౯ ప్ర॥ శ్రీవైష్ణవులకుఁబ్రత్యేకలక్షణము లేవైనగలవా?

ఉ॥ కలవు వారి యుపదేశము పంచసంస్కారమను వైదువిధులచే నేర్పడియున్నది.

౨౨ ప్ర॥ అవియేవోదయచేసి విశదీకరింపుడు?

ఉ॥ ౧-తాపము. అనగావిష్ణుచిహ్నములగు శంఖచక్రములు బాహుమూలంబులపరిచిహ్నితములగుట.

౨- పుండ్రము. అనగాలలాటంబున మధ్యహరిద్రాచూర్ణరేఖతోఁగూడిన యొకవిధమగు శ్వేతమృత్తుయొక్క రేఖలు.

అవి యింకను శరీరముయొక్క పదునొక్క స్థలంబుల ధరించవలెను. ఎట్లనగా నుదరంబునమూడు, వక్షస్థలంబునందొకటి, బాహుమూలంబులరెండు, కంఠంబున మూడువీపునరెండు, ఈద్వాదశోర్ధ్వపుండ్రములు ప్రత్యహమునుధరించి, ౧ కేశవ ౨ నారాయణ 3 మాధవ ౪ గోవింద ౫ విష్ణు ౬ మధుసూదన ౭ త్రివిక్రమ ౮ వామన ౯ శ్రీధర ౧౦ హృషీకేశ ౧౧ పద్మనాభ ౧౨ దామోదర యనువిష్ణుద్వాదశనామములచేఁ జేర్కొనవలెను.

3- నామము. విష్ణునామములధరించి యానామములచేతనే పిలువఁబడవలెను.

౪- మంత్రములు ఇవియుపదేశకాలంబున అర్థసహితంబుగ గురుముఖతః ఉపదేశింపఁబడును. విష్ణుమంత్రములనేకములు. వానియందెల్ల ముఖ్యములగునవి, విమషడక్షరియనఁబడు నారక్షరములతోఁ గూడినదియొకటి. నారాయణాష్టాక్షరి యనఁబడునెనిమిదియక్షరముల

దియొకటి వాసుదేవద్వాదశాక్షరియనఁబడు. పండ్రెండక్షరముల దొకటియునై యున్నవి. వీనిలో నారాయణాష్టాక్షరి. ద్వయము అనగా శరణాగతిమంత్రము, (భగవద్గీతా ౧౮ అధ్యాయము ౬౬ శ్లోకము) చరమశ్లోకమును గూడ రహస్యత్రయమనిఁ గాని మంత్రత్రయమని గాని పిలువఁబడియుపదేశకాలంబున ప్రతివారికినుపదేశింపఁబడును. ఈయుపదేశము నేజాతీయులైన నేమతస్థులయినను చివరకు మ్లేచ్ఛుఁడుగాని చండాలుఁడుగాని పడయవచ్చును. అతఁడు వైష్ణవుఁడనఁబడును. ప్రతిదినంబునట్టి వైష్ణవుండు కొన్నివారులా మంత్రంబు పఠించవలసియుండును.

౫- యాగము. ఏదేని విష్ణుప్రతిమార్చన; ఇది యుపదేశకాలంబున శిష్యునిచేనర్పింపఁబడుటకు గురువుచే నొకవిగ్రహ మొసఁగబడితదర్చావిధానమునుపదేశింపఁబడును. ఇటనుండి యాశిష్యుడు ఆవిగ్రహమునే పూజింపవలెగాని మరిదేనిని పూజింపఁదగదు.

౬౭ ప్ర॥ శ్రీరామానుజాచార్యులవారి గ్రంధము లేయాధారములపై యేర్పడియున్నవి?

ఉ॥ ౧- వేదములు (మంత్ర, బ్రాహ్మణ, ఉపనిషత్తులు.)

౨- స్మృతులు. ముఖ్యముగ మనుస్మృతి.

3- పాంచరాత్రములు. (వేదాంతానుగుణ్యములగునంతవరకు.)

౪- మహాభారతము, భగవద్గీత, విష్ణుపురాణము, శ్రీమద్రామాయణము.

౫- బ్రహ్మసూత్రభాష్యములు ఇదివరకుఁ జెప్పియుండిన ద్రమిడాచార్యబోధాయనులయొక్క బ్రహ్మసూత్రభాష్యములు.

౬౮ ప్ర॥ విశిష్టాద్వైతసిద్ధాంతమందు(మధ్య)సారాంశమేది?

ఉ॥ (పరమాత్మ) పరబ్రహ్మము నిజముగా నొక్కతత్వముమాత్రమై యున్నదనేదే.

౬౯ ప్ర॥ పరబ్రహ్మను గూర్చి యేమిచెప్పబడియున్నది?

పరబ్రహ్మము. సత్య (ఎల్లప్పుడుండునది) సత్య (సర్వదావికారములులేనిది) జ్ఞాన (శాశ్వతమైయపరిమితమైనది) అనంత (దేశకాలములచేకొలదిలేనిది) విభు(సర్వవ్యాపకమైనది) సర్వజ్ఞ(సమస్తముదెలిసినది) సర్వశక్తి(సమస్తమును జేయగలసమర్థతగలది.) అదిప్రపంచ

మునకు నుపాదానకారణము (పదార్థము) నిమిత్తకారణము (కరణము) సహకారి కారణము (సహాయము.)

౨౦ ప్ర॥ అట్టివస్తువున కేవేనినామములీయఁబడియున్నవా?

ఉ॥ వేదములందు అది సత్ (స్వయంభువు) ఆత్మ(అగోచరపదార్థము)బ్రహ్మంగొప్ప ఈశ-ఈశ్వర (ప్రభువు) విష్ణు (నారాయణ) జీవాంతర్యామి (అనిపిలువబడును. ఇతరపావన గ్రంథములందు పురుషోత్తమ- (మహాత్మ)విష్ణు వాసుదేవయని పిలువఁబడియున్నది.

౨౧ ప్ర॥ పరబ్రహ్మము జగత్తునకు ఉపాదానకారణము, నిమిత్తకారణము, సహకారికారణము, గూడనై యున్నాడనుటచే దాని భావమేమో బోధింపుడు.

ఉ॥ ఈసిద్ధాంతానుసారముగా ప్రతికార్యమును ఈకారణత్రయ సమ్మేళనచేత గలుగుచున్నది. ఘటసాదృశ్యముచేత ఘటంబునకు మన్ను ఉపాదానకారణము. కులాలుడు నిమిత్తకారణము. కాలము సహకారికారణములయ్యున్నవి. కాని విశ్వవిషయములో నీకారణంబులన్నియు మనసిద్ధాంతానుసారముగా నేకతత్వమగు పరబ్రహ్మమే యగును.

౨౨ ప్ర॥ అదియెట్లుగనుండును ?

ఉ॥ అది (ఆత్మయగు) చిత్తుతోడను, (అనాత్మయగు) న చిత్తుతోడను అవిభాగసంబంధముగలిగియుండును. స్వేతరతత్వద్వయములగు అదియట్టిస్థితియందు మాత్రమే తెలిసికొనఁబడుఁగాని అదిజడపదార్థముగాదు. చిత్తుకంటె నచిత్తుకంటెను భేదమై జ్ఞానస్వభావముగలదియై (జ్ఞానాత్మకమై) యుండును.

23 ప్ర॥ ప్రథమంబున నొక్కతత్వముమాత్రమే గలదనియంటిరి కాని యిప్పుడు చిత్తు నచిత్తునను రెండితర తత్వములుఁగూడఁ గలవనుచున్నారు. ఈసంగతులెట్లుసమన్వయమవును ?

ఉ॥ పరబ్రహ్మముమాత్రమె స్వతంత్రతత్వము (సత్యము) తక్కిన రెండునుదానినాశ్రయించియుండును చిత్తునచిత్తును పరబ్రహ్మమును ప్రత్యేకము గావిడియుండవు గాని పదార్థమునుగుణంబును ఒకదానితోనొకటి యవిభాగసంబంధము గలిగియుండు లాగుననుండును. బ్రహ్మము పదార్థముతోడను చిదచిత్తులు గుణంబులతోడను బోల్పనగును.

ఏలయనగా సాదృశ్యమునకు రంగు, పరిమాణము మొదలగునవి శాగితముయొక్క గుణములై యున్నవి

౧౮ ప్ర॥ ఈమూడింటికిఁగల సంబాధమునుగూర్చి వేదములందేమని చెప్పఁబడియున్నది?

ఉ॥ వేదములందు చిదచిత్తులు శరీరియగు పరబ్రహ్మము యొక్క శరీరమై యున్నట్టును శరీరి లేక శరీరమును శరీరము లేక శరీరియును విడిగానుండ నేరవనియును జెప్పఁబడియున్నవి

౧౯ ప్ర॥ ఉపనిషత్తులందు జెప్పఁబడిన శరీరశబ్దము యొక్క యర్థమిది యేనా?

ఉ॥ ఉపనిషత్తులందు శరీరశబ్దము మానవశరీరములవంటి శరీరబోధకముగా నుపయోగింపఁబడి యుండలేదు గాని శరీరమగునట్టి పదార్థమును (శరీరాత్మకమగు) గుణములను దెలుప ప్రయోగింపఁబడియున్నది శరీరమనగా నవిభాగైక్యసంబంధమని దెల్పు అపృథక్సిద్ధియను సంబంధమును జేసి అపృథక్సిద్ధమనియర్థమిచ్చును. ఇట్టిసంబంధము సర్వదానుండియున్నదియు మధ్యనెప్పుడును గలుగనిదియు (రానిదియు) నికెన్నటికి నివిడనిదియు (నశింపనిదియు) నై యున్నది. ఈవిధంబున చిదచిదీశ్వరులకు విడిపోని (నిత్య) సంబంధము గలిగియుండును.

౨౦ ప్ర॥ అటులైనచో ఈమూడింటికి నిజమైన భేదము గలదుగదా?

ఉ॥ కలదు. కానియానిజమగు భేదము ఔపాధికముగాని (అవస్థామూలకము) మాయాకృతము గాని (భ్రమమూలకము) గాదు. చిదచిదీశ్వరులొకటితో నొకటి యేకీభవించియుండువు. మరియునట్టి యైక్యస్థితియందే దెలుసుకొనఁబడును. అనగా నీశ్వరుండు చిదచిత్తులను గుణములకు నాశ్రయము (మూలము-అంతర్యామి) ఈమూడును శ్రుతులందు దెలుపఁబడినరీతిగా గాని యనుమానము దెలుసుకొనుటచేతగాని యేకతత్వమై యుండును.

౨౧ ప్ర॥ ఈతత్వశాస్త్రము (ఈజ్ఞానమతము) విశిష్టాద్వైతమని యేలపిలువఁబడును?

ఉ॥ విశిష్టాద్వైతమనుపదము విశిష్టము అద్వైతమునను రెండుశబ్దములతోఁగూడియుండును అద్వైతమనగా (సమానాధికరహితము) రెండు లేనిదియొక్క తత్వమనియు విశిష్టమనగా విశేషణములతోఁగూడినది.

అనగా చిదచిత్తులను శరీరముగాఁగలదియనియర్థమిచ్చును. కనుక విశిష్టాద్వైతమనగా చిదచిత్తులను విశేషణములుగాఁగలిగి వానితోఁగలసి యద్వయమై యేకతత్త్వమయిన పరబ్రహ్మమనియర్థమిచ్చును.

౭౮ ప్ర॥ ఈతత్త్వసిద్ధాంతమును, (కేవలైక్యత్వము) మిశ్రములేని యద్వైతసిద్ధాంతమును దెలుపు కొన్ని యుపనిషద్వాక్యములతో నెట్లు సమన్వయము చేయుదురు?

ఉ॥ ఈవాక్యములు మిశ్రములేనియద్వైతమును (కైవల్యాద్వైతమును) బోధించునట్లుగ నెంచబడవు. ఏలయనగా చిదచిదీశ్వరులయొక్క సత్యతను దెలుపు (చిదచిదీశ్వర తత్త్వత్రయము దెలుపు) నితరవాక్యములునుగలవు మరియును చిదచిత్తులు ఈశ్వరశరీరమైనట్టు దెలుపు మరికొన్ని వాక్యములుగూడఁగలవు కనుక యుపనిషత్తులలో నేపైకిపరస్పరవిరుద్ధముగా దోచు వాక్యములుగలవు- వానిసమన్వయము చేయు విధమేదనగా, చిదచిత్తులను పరబ్రహ్మముయొక్క విశేషములుగను. ఆ యేకతత్త్వమును, (పరబ్రహ్మమును) తద్విశేషణములకు నాశ్రయముగను భావించుటయేయైయున్నది. కావునవిడిపోవని త్రయముయొక్క యోగము (తత్త్వత్రయయోగము) ఒకటిగలదు. వేదాంతమందు అద్వైతము చెప్పఁబడినపుడు అద్వైత(శబ్దముయొక్క) అర్థము నిదియెయైయున్నది. (అద్వైతార్థమిదియెయైయున్నది.)

౭౯ ప్ర॥ కాని వేదమందు పరబ్రహ్మము (గుణములు లేనివాడు, విశేషములు లేనివాడు) అనగా నిర్గుణుడని చెప్పియుండలేదా?

ఉ॥ అవును కాని దీంచేత బ్రహ్మము విశేషణములు లేనివాడని (గుణరహితుడని) భావింపఁబడదు- ఎందుకనగా ప్రతినిత్యవస్తువును (ప్రతిసత్తును) గుణంబులుగలిగి యుండవలసినదె (బ్రహ్మము నొకసత్యవస్తువేగదా, సత్తేగదా) కానిదానియర్థమేమనగా మానవులు బద్ధులగు ప్రకృతిగుణంబులు అనగా పదార్థావరణ (ప్రకృతిపరిమితి) కొరతలు మొదలగు హేయగుణములు బ్రహ్మమునకు లేవనిదానియర్థము.

౮౦ ప్ర॥ గుణములనగా నేమి?

ఉ॥ సంస్కృతనైఘంటికానుసారముగా గుణమనుశబ్దమునకు సత్త్వరజస్సు, తమస్సులను ప్రకృతియొక్క మూడు గుణములనియర్థము (ప్రకృతియొక్క మూడుగుణములగు సత్త్వ రజస్సు తమస్సులనియర్థ

ము) బ్రహ్మము ప్రకృతియొక్క గుణములకు బద్ధుఁడుగాఁడు గావున ని ర్గుణుఁడని చెప్పబడినది.

౮౧ ప్ర॥ అట్లగునేని పరబ్రహ్మముయొక్క గుణము లేవి?

ఉ॥ ౧ జ్ఞాన (తెలివి) అదియే సమస్త జ్ఞానమునకు మూలము.

౨- శక్తి- ప్రతిదిఅనగా మనకసాధ్యముగదోచు దేనినేనిఁ జేయుటను

౩- బల- ప్రతిపదార్థమును దనలోనిముడ్చుకొనుసమర్థత. (ర్థత.

౪- ఐశ్వర్య- ప్రతిదానినిగ్రమంబుగనుంచుశక్తి.

౫- వీర్య- విశ్వమునకు (నుపాదానకారణము) నది యాధార ముగా నుంచినను ప్రకృతి వికారములకులోనుగానిసమర్థత

౬- తేజస్సు- (ప్రతిదానికినధిపతి) సర్వమునతిశయించుసమర్థత

ఇవిమిగుల ప్రబలమైనవి. ఇవిముఖ్యములు- కాని యింకనుసామా న్యవిశేషణములుగలవు అవియేవనగా, అక్ష్మ (క్షమించుట) కృప (క రుణ) వాత్సల్య (ప్రేమ) శీల (పరిశుద్ధత) ఆర్జవ (సరళత్వము)సౌహా ర్దము (సుగుణము=మంచి)

౮౨ ప్ర॥ పరబ్రహ్మము పేరులేనివాడని చెప్పియుండలేదా? (నామరహితుడుకాడా?)

ఉ॥ అవును. ఎందుకనగా పరబ్రహ్మమునకు ప్రత్యేకముగాఁ జె ప్పబడిన నామములేదు. ప్రత్యక్షముగాగాని యప్రత్యక్షముగాగాని సర్వనామముల చేతను పరబ్రహ్మము దెలుపబడును. అగ్ని, ఇంద్ర, ఇం క నితరనామములు కొన్నిపర్యాయములు ప్రత్యక్షముగాను కొన్నితడ వలు పరోక్షములుగాను పరబ్రహ్మమును దెలుపును. నారాయణ, విష్ణు వాసుదేవనామంబులు పరబ్రహ్మమును ప్రత్యక్షముగా దెలుపును.

౮౩ ప్ర॥ పరబ్రహ్మము నిరాకారుడు(ఆకారము లేనివాడు) అరూ పుడు(రంగు లేనివాడు)అనిచెప్పబడియుండలేదా?

ఉ అవును. అతడుకుదురైనఆకారము లేనివాడును, ఆకృతి లేని వాడును రూపము లేనివాడును,(వర్ణము లేనివాడును=రంగు)అవును ఎం దుకనగా సర్వవ్యాపియు, (అంతటనిండియుండువాడును) అనంతమగు వాడును (అపరిమితమైనవాడు) అవును గాని స్వేచ్ఛామాత్రమున పరి మితమగునట్టియు సూర్యవర్ణముగలుగునట్టి నేరూపమునయినను ఏవిగ్ర హమునయినను (శరీరము) ధరించగలడు.

౮౪ ప్ర॥ అతడేరూపము నేయాకారముగలవాడు?

ఉ॥ అది యైదువిధంబులై యుండును-

౧- పరవిగ్రహము- ఇందుతో మూర్తీభవించిన ఈశ్వరుండు వైకుంఠలోకంబున శంఖ, చక్ర, గదాది, తన యనేకాయుధములతోడను కిరీట, కుండల, హార, కౌస్తుభాది భూషణములతోడను సదాయుండును (నివసించును) ఈయాయుధములును, భూషణములును ఏవేని దివ్య దేవలక్షణములకు చిహ్నములు మాత్రమేయగును

౨- వ్యూహవిగ్రహ సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధయను వ్యూహవిగ్రహము. ఈమూడువిగ్రహములతో (శరీరముల) విష్ణువుక్రమంబుగ ఆమోద, భువన, ప్రమోదములందువసించును. ఈమూడును ప్రాకృతవిశ్వములోనిదగు సత్యలోకంబునందుండు విష్ణులోకములనిపిలువఁబడును ఈలోకంబులందు నామూడువిగ్రహములను దేవతలు) ఉపాసకులుపూజించి ప్రాకృతప్రళయంబున మోక్షము నొందుదురు. అప్పుడా మూడులోకంబులునునశించును.

౩- విభవ రామ కృష్ణ విగ్రహములవంటి అవతారము చేగలిగినవిగ్రహము.

౪- అర్చావిగ్రహము- మంత్రజపము యొక్కయు పఠనము యొక్కయు శక్తిచేత ప్రతిమలలోనికి ప్రవేశించు గ్రహణస్వభావముగల అగోచరవిగ్రహము. అప్రతిమయు (చరముఖ) విగ్రహమని యేపిలువఁబడును ఈశరీరము క్రమముగా నర్చనజరగకుండినను మరి యేవిధమునయిన యపరిశుద్ధమైనను ఆప్రతిమనుండి వెళ్ళిపోవును.

౫- అంతర్యామివిగ్రహ- ఒకడుతన (కేవలాత్మతో) నిజాత్మను ధ్యానించునప్పుడు గనబడునొకవిధమగు విగ్రహము (శరీరి) ఈశ్వరుడు ఈయైదు విగ్రహములలో దేనినేని ధరించినప్పుడు, లక్ష్మియును తదనుగుణ్యావిగ్రహముతోడతనభర్తను (ప్రభువును) వెంబడించియాయనతోనుండును- ఈశ్వరుండు అపరిమితుండైనను అనంతుడైనను పరిమితవిగ్రహమొకటి దానిని గలిగియుండి ఆకాశమునుగలిగిన ఘటంబు ఆకాశమున చలించుచందమున పరబ్రహ్మనుండే సంచరించునట్లుచెప్పవచ్చును.

౮౫ ప్ర॥ అట్టి (శరీరము) విగ్రహము కర్మచేతగలిగినదా?

ఉ॥ లేదు.

౮౬ ప్ర॥ అట్టిశరీరము (విగ్రహము) ప్రాకృతమా?

ఉ॥ అదిసామాన్యప్రకృతిచేత. గూడియున్నదిగాదు. విలక్షణమగుజ్ఞానపదార్థమగు శుద్ధసత్వముతో గూడియున్నది- (శుద్ధసత్వప్రకృతిచే గలిగినది)

౮౭ ప్ర॥ అట్టివిగ్రహము (శరీరము) వలనప్రయోజనమేమి?

ఉ॥ నిరాకారభగవంతుని గూర్చినధ్యానము అసాధ్యముగనుక యోగులయొక్క ధ్యానమును సులభపరుచుటకుగాను ఈశ్వరుడీశరీరమును ధరించెను.

౮౮ ప్ర॥ అచిత్తనగానేమి?

ఉ॥ అచిత్తు త్రివిధము- అదిసత్వశూన్యమగు కాలము- మూలప్రకృతి- రజస్సుతమస్సులతో గూడిన సత్వమగుమిశ్రసత్వము- కేవలసాత్వికమైజ్ఞానద్రవ్యమగు శుద్ధసత్వము- అచిత్తుకదలనేరనిది యనగా స్వతంత్రశక్తిలేని ద్రవ్యమనియర్థమిచ్చుజడమని గూడ పిలువబడును.

౮౯ ప్ర॥ కాలమనగానేమి?

ఉ॥ కాలముసమస్తపరిణామములకు (వైకృతులకు) కారణంబును, శాశ్వతమును. సర్వవ్యాపకమైనదియు (అఖండకాలము) నైయున్నది. ఖండకాలముశాశ్వతముగాక గ్రహసంచారముచేత గంటలు, దినములు, యుగములు, కల్పములు, మొదలగునవిగ గణింపబడును. కాలముసత్వాదిగుణత్రయశూన్యమని (సత్వ, రజస్సు, తమస్సులు లేనిది) గూడపిలువబడును.

౯౦ ప్ర॥ మూలప్రకృతియనగానేమి?

ఉ॥ మృత్తుఘటంబునకు నుపాదానకారణమైనరీతిగనే మూలప్రకృతి విశ్వమునకు నుపాదానకారణమగును. అటువలెనే జీవాత్మయొక్క శరీరముగాను జగత్తునందలి ప్రతిపదార్థముయొక్క శరీరముగనుం గూడ నేర్పడును. అదిచిత్తు (జీవాత్మ) కంటెను ఈశ్వరుని (పరమాత్మ) కంటెనుభేదము. దానికినాదియులేదు. స్వయంభూతము శాశ్వతము- సర్వవ్యాపి- ఏకము- కాని సర్వవిధంబుల బ్రహ్మమునకు లోబడియుండును. (శేషము)

౯౧ ప్ర॥ అది (మూలప్రకృతి) వేదమునందేమనిపిలువబడును?

ఉ॥ అది ప్రకృతి, ప్రధాన, మూలప్రకృతి అవ్యక్త, మాయఅని పిలువఁబడును. అదికొన్నిమారులు తమస్సు, అక్షర, బ్రహ్మమ్, అను శబ్దములచేఁగూడఁ దెలుపబడును. అది సత్వ, రజస్సు, తమస్సులను గుణత్రయమునకుఁ గారణము ఈగుణంబులతో దానివిలాసములనన్నిటిని గలిగించును. ప్రకృతియనగా సత్వరజస్తమోగుణంబులలో నేదియు నొండొంటినతిక్రమించనిస్థితియందుండుపదార్థము.

౨ ప్ర॥ అది మొదట దేని పుట్టించెను? అది మొదట దేనిగపరిణమించెను?

ఉ॥ (తెలివి) మహత్తు- ఇది సాత్వికమహత్తు, రాజసమహత్తు, తామసమహత్తు లని త్రివిధమయ్యెను మహత్తనగ గుణత్రయము సమభాగములుగ నుండని ప్రకృతియొక్క సన్నిహితపరిణామము (మొదటిపరిణామము).

౩ ప్ర॥ మహత్తునుంచి యేమికలిగెను?

ఉ॥ (ఆత్మాభిమానము=మమత) అహంకారము ఇదియు సాత్వికాహంకారము లేక వైకారిక, రాజసాహంకారము లేక తైజసా, తామసాహంకారము లేక భూతాది యనిత్రివిధము. ఇవియిప్పుడుచెప్పిన త్రివిధ మహత్తులనుంచి క్రమంబుగఁబుట్టెను.

౪ ప్ర॥ మహత్తు, అహంకారముల స్వభావమునుఁగూర్చి వివరింపుఁడు?

ఉ॥ వీనినొకయుపమానముచే ప్రకాశపరచెదను అవి ప్రకృతియొక్క వేరువేరుస్థితులకుసంబంధించును భూమినుండి త్రవ్వఁబడినమన్ను ఘటంబుగఁ జేయఁబడక ముందు వివిధములగుమార్పులను వికృతులనుబొందునట్లుగనే ప్రకృతియు విశ్వముగ పరిణమించకముందు ననేకవికారములఁ జెందును.

౫ ప్ర॥ సాత్వికాహంకారమునుండి యేమికలిగినది?

ఉ॥ సాత్వికాహంకారమునుండికలిగినవి యేవనిన:—

౧ మనస్సు (అంతఃకరణము)

౨ జ్ఞానేంద్రియపంచకము (శ్రోత్ర,త్వక్ చక్షు, జిహ్వా, ఘ్రాణములు.)

౩ కర్మేంద్రియపంచకము (వాక్పాణిపాదపాయూపస్థలు) వాక్కు) పాణి (హస్తములు) పాద (కాళ్ళు) పాయు (మలవిసనావర్జ

యవము) ఉపస్థ (గుహ్యము). రెండవతరగతి విజ్ఞానేంద్రియపంచకము తో క్రమంబుగ సంబంధించు విషయగ్రాహకములు

౯౬ ప్ర॥ తామసాహంకారమువలన నేమిగలిగెను ?

ఉ॥ తామసాహంకారమువలన పంచతన్మాత్రలు కలిగెను. ఇవి స్థూలంబులగు పంచమహాభూతంబులయొక్క గుణంబులుగలసారంబుల నెంచబడును. పంచతన్మాత్ర లేవనగా శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము. ఈతన్మాత్రలు పంచభూతంబులను గలుగజేసెను.

౯౭ ప్ర॥ పంచభూతములనగానేవి ?

ఉ॥ ౧ ఆకాశము (శబ్దజనితము) శబ్దతన్మాత్రచేగలిగిన ఆకాశము. ఇది (దేశ) బయలంతటను వ్యాపించి ప్రతిచోటను ప్రతిదానిలో నుండునంతటి సూక్ష్మద్రవము.

౨ వాయువు-స్పర్శతన్మాత్రచేగలిగిన సూక్ష్మభూతమగు వాయువు. దీనికి స్పర్శప్రధానగుణముమాత్రమేగలదు.

3 అగ్ని-రూపతన్మాత్రచేగలిగినఅగ్ని. (కాంతి ఉష్ణము అగ్ని)

౪ అప్-రసతన్మాత్రచేగలిగిన జలము ఉదకము (అప్)

౫ పృథ్వి-గంధతన్మాత్రచేగలిగిన పృథివి.

౯౮ ప్ర॥ రాజసాహంకారమువలన నేమిగలిగెను ?

ఉ॥ రాజసాహంకారము ఈశ్వరునియొక్క యిచ్ఛచేత ప్రకృతి మహత్తులు ప్రతిపదార్థమునుగలిగించులాగున సాత్వికాహంకారమునను తామసాహంకారమునకును తోడ్పడును. (సహకారియగును.)

౯౯ ప్ర॥ జగత్సృష్టికిపూర్వము ప్రకృతి యేరూపంబుననుండెను?

ఉ॥ సృష్టిప్రారంభముకాకముందు ప్రకృతి నిరాకారియై అవ్యక్తమైయుండెను. అదిబహుశః పరమాణుస్థితి (రూపమందు) యందుండునని చెప్పవచ్చును. దానిగుణంబులు సూక్ష్మావస్థయందుండెను.

౧౦౦ ప్ర॥ శుద్ధసత్వమనగానేమి ?

ఉ॥ అదితనకంటెభిన్నమైన ప్రకృతిగుణంబులకు లోనుగాని (లొంగని) యొకద్రవ్యము. దానికిగలనామములు స్వచ్ఛ, ద్రవ్య, నిత్యవిభూతి యనునవే. ఈశుద్ధసత్వమునుంచి (విష్ణులోకమగు) వైకుంఠమును, ఈశ్వరవిగ్రహములును (శరీరములు) ముక్తులశరీరములునుగలిగెను. వారియిచ్ఛామాత్రమునుజేసి యీశరీరంబులను ధరింతురు.

అదిస్వభావమున జ్ఞానమయమగునదియైనను జీవికాకపోవుటచే అచిత్తులో జేర్పఁబడినది. ఈశుద్ధసత్వము దానిస్వభావముచే నతిసూక్ష్మమగుటచే దృగ్గోచరముగాదు.

౧౦౧ ప్ర॥ చిత్తనగానేమి ?

ఉ॥ అదిజీవాత్మ (జీవుడు) ప్రాకృతముగాదు అది అచిత్తుకంటెను ఈశ్వరునికంటెను భేదమై దేనిచేతను గలుగఁజేయబడని నిత్యవస్తువైయున్నది. ప్రతిపురుషునియందలి జీవాత్మయు మరియొకనియందుండు జీవాత్మకంటె భిన్నమైయుండును. చిత్తు లేక ప్రత్యక్ అనగా జ్ఞానముగలదేయని యర్థమిచ్చును. అది జీవుని ఈశ్వరునిఁగూడ తెలుపును గాని ఈశ్వరు జ్ఞానము నిత్యమును అనంతమునై వికాసమునకు నేవిధసహాయము నగత్యములేక యుండగను జీవునిజ్ఞానము బంధముచేత పరిమితముగలదియైయుండగాను చిత్తనుశబ్దము సామాన్యముగా జీవాత్మనుమాత్రమె దెలుపుదుచేయుటకు నుపయోగింపఁబడును. దానియాకృతి సామాన్యముగ అణువైయుండినను దానిజ్ఞానము మోక్షమందున నంతమగును.

అది నిష్కళంకమును (పరిశుద్ధమును) ఆనందమయమును, అణుమాత్రమును, జ్ఞానముగలదియును, నిర్వికల్పమును, మరియును గ్రిహణశక్తికి మూలమునైయున్నది. (మోక్షము నొందుదనుక కర్మబద్ధమగునట్టి) జీవుడు (అహంవాచ్యుడు)పరబ్రహ్మమునకుఁ బరతంత్రుడు (శేషి) నైయుండును.

అదిమోక్షము నొందువరకు ప్రకృతిసంబంధములేక యుండనేరదు ప్రకృతియొక్క ప్రత్యంశమును (అణువును) జీవయుక్తమై తాను గలిగియుండిన జీవునికి శరీరమైయుండును ప్రతిజీవియును పరమాత్మను శరీరిగాను అనగా నంతర్యామిగాను గలిగియుండును. పరబ్రహ్మము ప్రతిజీవునియందును ప్రకృతియొక్క ప్రతియణువునందును వ్యాపించియుండును. జీవులుమూడువిధములైయుండును.

౧౦౨ ప్ర॥ జీవులయొక్క మూడుతరగతులను దయచేసివివరింపుడు (త్రివిధచేతన లక్షణముల వివరింపుడు)

ఉ॥ వారెవరనగా (నిత్యానంద- బ్రహ్మానంద) మను పరమానదంమును నిరంతరమును అనుభవించుచు నెన్నటికిప్రకృతిలేక కర్మబ

ద్ధులు గానట్టినిత్యులు.

౧ వారుసర్వజ్ఞులై వైకుంఠలోకమున వసింతురు. వారలు అనంతగరుడ విష్వక్సేనులాదిగాగలవారు.

౨ మోక్షమునులభించి యీవిధమున సమస్తదుఃఖములవలనను, ప్రకృతి బంధమువలనను విముక్తులై సర్వజ్ఞులైనముక్తులు.

3 బద్ధులు- సమస్తకర్మమును ప్రకృతిసంబంధమునగలుగు దుఃఖములకును లోబడినవారగుబద్ధులు- వారు దేవతలు, మానవులు, తిర్యక్కులు

౧౦3 ప్ర॥ పరబ్రహ్మమే సకలకార్యములకు (పదార్థములకు) గొప్ప మొదటికారణమైయుండెనని తొలుతమీరుచెప్పినట్లు నేనుగ్రహించితినిగాని తమవాతమీరు ప్రకృతియే జగత్కారణమై యుండెనని చెప్పితిరి. అది ఇదియెట్లన్యోన్యోవివరింపుడు.

ఉ॥ ప్రకృతి జగత్తునకు నుపాదానకారణమైనప్పటికిని తానుగుణము (విశేషణము) అనగా శరీరమైయుండిన పరబ్రహ్మము లేక అదియుండనేరదు- ఈవిధముగాపరబ్రహ్మము తానే ప్రకృతికి కారణమైనట్లు చెప్పఁబడవచ్చును పరబ్రహ్మమునకు శరీరమైన ప్రకృతియు తాననేకరూపములుగ పరిణమించును. అనగా పరబ్రహ్మము లేక స్వతంత్రముగా ప్రకృతి జగత్కారణముగాదుగానిపరబ్రహ్మముయొక్క విశేషణముగా (గుణముగా) పరతంత్రముగల రెండవకారణమైయుండును. ఉపాదానకారణమనగా బంగారము భూషణముయొక్కయు, మృత్తుఘటముయొక్కయు నుపాదానకారణమైనట్టుగానే రూపము మార్పుజెంగినమీదట దేనిచేతనొక కార్యముగలుగుచున్నదో యదియుపాదానకారణమని యిక్కడ నాయభిప్రాయము- ప్రకృతిఅప్రత్యక్షమైన (అంతర్హితమైన) అభేదమైనసూక్ష్మస్థితి, భేదమైనస్థూలస్థితియును రెండుసందుచితస్థితులందునుండును- స్థూలస్థితియందు అదిజగత్తునిపిలువబడును రూపపరంపరలను గలుగజేయును. హిందూతత్వశాస్త్రమునందు సూక్ష్మస్థితియందలి ప్రకృతికారణమనియు, (స్థూల) దానివికాసస్థితియందు కార్యమనియు జెప్పబడును. ఈయర్థమందు (ఈయభిప్రాయముచేత) బంగారును, మన్నును భూషణమునకును ఘటమునకును మూలకారణములైనట్టుచెప్పఁబడును. కాని వికాసస్థితియందుగాని యవికాసస్థితి

యంమగాని ఆయేకమగు పదార్థమే (ప్రకృతి) పరబ్రహ్మమునకు శరీరముగాను, పరబ్రహ్మముతనశరీరిగాను ఎల్లప్పుడునెంచఁబడును.

౧౦౪ ప్ర॥ బంగారము బంగారపనివానికంటెను, ఘటముకు లాలునికంటెను భిన్నమైనవిధమున ఉపాదానకారణమును, నిమిత్తకారణము నొకటి మఱొకటికంటె వేఱైయుండును. అట్లగుచో పరబ్రహ్మము,ఉపాదానకారణంబుగనునిమిత్తకారణంబుగనుగూడనెట్లుండు?

ఉ॥ తనయిచ్ఛచేత, తనగుణమగుప్రకృతి తనలోనుండి విశ్వమును గలిగించుటంజేసి (వికసించుటచే) పరబ్రహ్మము నిమిత్తకారణమగునటులఁ జెప్పఁబడును.

కాలముజగమునకు (సహాయకారణము) సహకారి కారణమని జెప్పబడును. (కాలముశరీరముగాగల)కాలశరీరి యగుటచే పరబ్రహ్మము జగంబునకు సహకారికారణమని గూడనై యున్నటులఁజెప్పనొప్పను.

౧౦౫ ప్ర॥ కానిప్రకృతిపరిణామము (వికాస=వికరణము) చేత జగముగలిగినదని చెప్పబడుచేని పరబ్రహ్మము సృష్టియొక్క కారణమగునని యెట్లుచెప్పఁబడగలదు?

ఉ॥ సృష్టియనుపదము (శబ్దము) తప్పుపేరై యున్నది. ఇదివరకె యుండియున్న ప్రకృతినుండి పరబ్రహ్మము విశ్వమును వికసింపఁజేసెను. ప్రకృతియును పరబ్రహ్మముయొక్కయిచ్ఛకు లోబడి (ఇచ్ఛానుసారముగా) తననుండివిశ్వమును వికసించెను. ఈవికరణమె (ఈపరిణామమె) సృష్టియనిపిలువబడును. శూన్యమువలననే దేనియొకపదార్థము సృజింపఁబడఁగలదని నమ్ముటయసాధ్యము. సృష్టి యిరుతెరంగులనియు నింకను ముప్విధంబులనియు గూడచెప్పఁబడును.

౧౦౬ ప్ర॥ ఆయిరుతెరంగు లెవ్వియైయుండును?

ఉ॥ అవియేవనగా. ౧ సమష్టిసృష్టి (సామాన్యసృష్టి) ౨ వ్యష్టిసృష్టి (ప్రత్యేకసృష్టి)

౧౦౭ ప్ర॥ సమష్టిసృష్టియనగానేమి?

ఉ॥ పరబ్రహ్మము యొక్క యిచ్ఛానుగుణ్యముగా మహత్తు, అహంకారాదులు జనించుట సమష్టిసృష్టి, సమష్టిసృష్టిపరబ్రహ్మేచ్ఛానుసారముగా మహదహంకారాదులుజనించుటయే,

౧౦౮ ప్ర॥ వ్యష్టిసృష్టియనగానేమి?

ఉ॥ వ్యష్టిసృష్టియనగా పంచభూతములు కలిగినతరువాత నా పంచమహాభూతంబులు (పంచకారణమును) క్రమముగునన్యోన్యోచిత భాగంబులుగ గూడిన సమ్మేళనమువలనగలుగు సృష్టి పరిణామముల య్యెాడును. అట్టిసమ్మేళనము లేకయే ప్రత్యక్షసృష్టిపరిణామము గలుగ నేరదు. కర్మచేతోడ్పడిన యీపరిణామముచేత విశ్వమునందలి వివిధములగుశరీరములు గలిగించఁబడును. అవినలువిధంబులై యుండును

౧౦౯ ప్ర॥ విశ్వమునందలి శరీరముల నలువిధంబులేవై యుండును ? (నలువిధశరీరంబులేవేలి)

ఉ॥ అవియేవనగా.

౧ సుర=(దైత్యగంధర్వాదులు)

౨ నర=(మానవులు)

౩ తిర్యక్=(జంతువులు)

౪ స్థావర=(శాక=వృక్షములు, ఖనిజములు)

౧౧౦ ప్ర॥ సృష్టియొక్క ముప్విధంబులెవ్వియైయుండును ?

ఉ॥ అవియేవనగా. ౧ ప్రాకృతసృష్టియనగా పైనవివరింపఁబడి న సమష్టిసృష్టికి ననుగుణముగా మహదహంకారముల పరిణామము అది మొదటననగా తొలుత బ్రహ్మయొక్క జీవితకాలమగు ప్రతిమహా కల్పమందు నొక్కమారుజరుగును (గలుగును.)

౨ దైనందిన సృష్టియనగా (బ్రహ్మకొకదినమగు) ప్రతిబ్రహ్మకల్పమందు నాదియందొక్క పర్యాయముగలుగు పరిణామము (సృష్టి) అదివ్యష్టికిననుగుణముగా నుండును

౩ నిత్యసృష్టి అనగా సమస్తస్థూలశరీరములయొక్కయు జననవృద్ధులవంటివి. కర్మఫలానుగుణ్యముగా ప్రతిదినమును జరుగు పరిణామము (సృష్టి)

౧౧౧ ప్ర॥ కల్పమనగానేమి ?

ఉ॥ కల్పమనగా నొకనియతకాలము. బ్రహ్మకల్పమనియు మహాకల్పమనియు రెండుకల్పములుగలవు. కల్పమనునది మన్వంతరములని పిలువఁబడి యింకనుతక్కువగు నియతకాలములతో నేర్పడును ఈమన్వంతరములు తిరిగియుగములని పిలువఁబడు కాలవ్యవధులచే నేర్పడును.

అట్టియుగములలో నాలుగుగలవు.

౧౧౨ ప్ర॥ ఆనాలుగుయుగంబులేవి?

ఉ॥ ౧ కలియుగము—౪౩౨,౦౦౦ సంవత్సరములుగల కలియుగము.

౨ ద్వాపరయుగము--౮౬౪,౦౦౦సంవత్సరములుగల ద్వాపర యుగము.

౩ త్రేతాయుగము-౧,౨౯౬,౦౦౦ సంవత్సరములుగల త్రేతాయుగము.

౪ కృతయుగము--౧,౭౨౮,౦౦౦ సంవత్సరములుగల కృతయుగము

ఈచతుర్యుగములవెరసి మొత్తము ౪,౩౨౦,౦౦౦ సంవత్సరములు, ఇవి యొకమహాయుగముగ నేర్పడును.

౧౧౩ ప్ర॥ మన్వంతరమనగా నేమి?

ఉ॥ మన్వంతరమనగా, నొకమనువుయొక్క వయసు (జీవితకాలము) అది డెబ్బదియొక్క మహాయుగములకు సమానమైయుండును.

౧౧౪ ప్ర॥ బ్రహ్మకల్పమనగా నేమి?

ఉ॥ బ్రహ్మకల్పమనగా బ్రహ్మయొక్క యొకదినము అది, ప్రతి మన్వంతరములకు మధ్యకాలమగు సంధులతో గూడపదునాలుగు మన్వంతరములకు సమమైయుండును ఈకాలమంతయు (ఈ బ్రహ్మకల్పము) ౧౦౦౦ మహాయుగములకుసమము.

౧౧౫ ప్ర॥ మహాకల్పమనగా నేమి?

ఉ॥ మూడువందలయరువై బ్రహ్మదినములు. అనగా బ్రహ్మకల్పములు సమానవిశ్రాంతకాలములగు రాత్రులతోగూడ బ్రహ్మకొక సంవత్సరమగును అటువంటి సంవత్సరశతంబు (నూరు వత్సరములు) బ్రహ్మయొక్క జీవితకాలమై యొకమహాకల్పమని పిలువఁబడును. ఇదియును మానవసంవత్సరములు ౩౧౧,౦౪౦,౦౦౦,౦౦౦,౦౦౦, మానవవత్సరములకు సమమైయుండును.

౧౧౬ ప్ర॥ వర్తమానమహాకల్పములో నేభాగమును మనమిప్పుడుపొందియున్నాము?

ఉ॥ ఈప్రస్తుతయాకృతియందున్న (దానివర్తమాన యాకృతియందున్న) విశ్వముయొక్క సృష్ట్యాదినుండియు నీమహాకల్పములో నొకసగముగతించియున్నది. ఆసగము పరయనిపిలువబడును. నపరమనురెండవసగము నిప్పుడే ప్రారంభించియున్నది. యనగాబ్రహ్మజీ

విత కాలములో నేబదియొకటవ సంవత్సరమారంభమైయున్నది. ఇప్పటికిక నాల్గురు మనువుల ప్రభుత్వకాలములు సమాప్తినొందియున్నవి. ప్రస్తుతంబున పరిపాలించుమనువు వైవస్వతుడనువాడు నేడవయతడుల తడు పరిపాలించుటకు ప్రారంభించిననాటనుండియు డెబ్బదియొక్క మహాయుగములలో నిరువదియేడు మహాయుగములు గతించియున్నవి. మనమిప్పుడు ఇరువదియెనిమిదవ మహాయుగమందున్నాము. ఈమహాయుగములో మూడు చిన్నయుగములు గతించియున్నవి. మరియునిప్పుడు వర్తమాన నాల్గవయుగమగు కలియుగముయొక్క ౪౯౯౭వ సంవత్సరమందున్నాము.

౧౧౭. ప్ర॥ ప్రళయమనగా నేమి?

ఉ॥ విశ్వము తనయిప్పటిదైన స్థూలరూపమునుండి సూక్ష్మరూపములోనికి మారునప్పుడు, అదిప్రళయమందున్నదని చెప్పబడును. ప్రళయమునలు విధములై యుండును. ఏవనగా ౧ ప్రకృతిప్రళయము ౨ నైమిత్తికప్రళయము ౩ నిత్యప్రళయము ౪ అత్యంతికప్రళయము.

౧౧౮ ప॥ ప్రకృతిప్రళయమనగా నేమి?

ఉ॥ ప్రకృతిప్రళయమనగా దీనియందువిశ్వమంతయును దాని ప్రస్తుతస్థితినుండి సూక్ష్మస్థితిలోనికి మారును మరియు (నభేద) సూక్ష్మప్రకృతిలోనికి లీనమగును. ఇట్టిప్రకృతిస్థితియందు దానిసత్వరజస్తమోగుణంబులకు వైషమ్యముండనందున సృష్టిజరగనేరదు. ఈప్రకృతిప్రళయము ప్రతిబ్రహ్మయొక్క జీవితకాలములో ననగామహాకల్పములో నాదియందు నొక్కపర్యాయముజరుగును.

౧౧౯ ప్ర॥ నైమిత్తికప్రళయమనగా నేమి?

ఉ॥ ఈ ప్రళయము ప్రతిబ్రహ్మకల్పము యొక్కయంతమునందు నొక్కమారుజరుగును (కలుగును.) దీనియందుత్రిలోకంబులు (సూర్యమాలికలు) తమప్రస్తుతస్థితినుండి తమయందుగల సమస్తపదార్థములు వానియాదిమభూతముల లోనికి చేరునట్టిప్రారంభ స్థితిలోనికిఁ జేరును.

౧౨౦ ॥ నిత్యప్రళయమనగా నేమి?

ఉ॥ నిత్యప్రళయము ప్రతినిముషమునజరుగును. అదిమరణము వంటి నశ్వరస్థితిలోనికి శరీరంబులు పోవునప్పుడు అవిపొందునట్టిమార్పువంటివికృతియైయున్నది.

౧౨౧ అత్యంతికప్రళయమనగా నేమి?

ఉ॥ అత్యంతికప్రళయమనగా జీవప్రకృతులకు గలసంబంధము విఘటనటువంటి స్థితియైయున్నది. ఇదిజీవుడు ముక్తినొందునపుడుకలుగును

౧౨౨ ప్ర॥ విశ్వము సత్యమనియు పూర్వముగా నశ్వరముగా దనియు తామెచెప్పినట్లుగ్రహించుచున్నను (నాకుతోచినది) కాని ఘటంబులు ముక్కలుగా భిన్నమగుటయు ప్రవాహములిగురుటను, ఇంకనితరప్రాకృతపదార్థములు లీనమగుటయు నశించుటయు మనము చూచెదముగదా యట్లయినవిశ్వము సత్యమేనా?

ఉ॥ విశ్వము ఘటంబునకంటెను ప్రవాహమునకంటెను మరియేపదార్థమునకంటెనుగూడ విశేష విలక్షణంబగు సత్యస్వరూపము గలదని నేనుచెప్పను ఆకారము=రూపముగల ప్రతిపదార్థమును క్షీణదశ్యములకు నధీనమైయుండును. అనగారూపములునశ్యములుగాని వానియుపాదానకారణమైన సత్యపదార్థమునశ్యముగాదు. (మిథ్యగాదు.) స్థూలశరీరంబులన్నియు నశించిపోవును. ఇక సత్యముగానుండు పదార్థములేవనగా సూక్ష్మములగు నణువులేయైయున్నవి అవిసృజింపఁబడనివియు నశింపచేయనగనివియు సూక్ష్మస్థితియందు నగోచరంబులైనవియునైయున్నవి. అనగాప్రళయమందు సత్వరజస్తమస్సులనుమూడుగుణంబులు నిర్వ్యాపారంబులు గలవైయుండును. సృష్టిజరుగునపుడు అవిసంచరించును. (వ్యాపారసహితములగును.) విశ్వమును తిరిగి సృష్టింపఁబడును. ఒకఘటంబుభిన్నముచేయఁబడి దానిముక్కలు (శకలములు) ధూళిగాఁజేయఁబడవచ్చును. గానిధూళిగానేర్పడిన యణువులు నశింపఁజేయఁబడనేరవు. ఈయర్థంబున (పక్షమున) జగత్తుసత్యము.

౧౨౩ ప్ర॥ జననమరణములనగా నేమి?

ఉ॥ ఒకశరీరమునందు జీవాత్మప్రవేశించుట జననమనఁబడును ఒకశరీరమును జీవాత్మ విడుచుట మరణమనఁబడును ఒకశరీరమందు జీవుడు కొంతకాలమువరకు నివసించి యటువిమ్మట దానిని విడిచిపెట్టి సుదీర్ఘకాలమైనవిమ్మటనేని లేక స్వల్పకాలమైనవిమ్మటనేని మరియొక శరీరమునఁ బ్రవేశించును మరియొక శరీరంబునకైన దానిపరివర్తన (అది వేరొకశరీరమున బ్రవేశించుట) పునర్జననమనఁబడును. జననము, మరణము, పునర్జననము, వికారముగల (వికారాస్పదమగు) శరీరముయొ

క్క యావశ్యకము లేగాని (శరీరమాత్రయావశ్యకములు గాని) నిర్వికారియగు జీవుఁ యొక్క యావశ్యకములు గావు.

౧౨౪ ప్ర॥ కాని, జీవాత్మ యప్రాకృతుడై, శాశ్వతుడై, నిర్మలుడై యుండెనేని అది ప్రకృతిసంబంధములోనికి నెట్లు రాగలుగును (శరీరధారణముచేత) ఇట్లుసుఖదుఃఖములకు నెట్లు లోనగును? (కష్టసుఖములకెట్లు పాల్పడును?)

ఉ॥ ప్రకృతితో జీవాత్మయొక్క సంబంధమునకు దుఃఖమునకు సుఖమునకునుగూడ (సుఖదుఃఖములకును) కర్మయే కారణమైయుండును. అది (మానవపరమాణువు) కారణశరీరరూపముననుండును. (కర్మ కారణ శరీరాకారమున ప్రకృతితోడ జీవాత్మయొక్క సంబంధమునకును కష్టసుఖములకును కారణమునై యుండును) కర్మమనఁ జెప్పఁబడిన జననమరణ పునర్జననములను సర్వవిధ శరీరంబును గలిగించు కారణమైయున్నది.

౧౨౫ ప్ర॥ కర్మయనగా నేమి?

ఉ॥ కర్మయనగా జీవాత్మయొక్క యొకకతో గూడిన (జ్ఞానము గల) మంచిదేని, చెడుదేనియగు, క్రియయొక్క ఫలమైయుండును. (యున్నది) సత్కర్మయీశ్వరుని సంతసింపఁజేయును. (అది సత్కర్మ) దుష్కర్మ ఈశ్వరుని గోపింపఁజేయును. (అది దుష్కర్మ)

౧౨౬ ప్ర॥ జీవునియొక్క క్రియకర్మ నెట్లు గలిగించును?

ఉ॥ అజ్ఞానయనగా ౘ విద్యచేతను అది ౧ అన్యథాజ్ఞాన ౨ విపరీతజ్ఞానములని యిరుదెరంగులై యుండును.

౧౨౭ ప్ర॥ అన్యథాజ్ఞానమనగా నర్థమేమి?

ఉ॥ అది ఒక పదార్థముయొక్క గుణములనుజూచి మరియొక పదార్థగుణములుగా భ్రమించుటయని దానికర్థము. (ఒకపదార్థధర్మమును వేరొకపదార్థధర్మమునుగా భ్రమించుటయని దానికర్థము)

౧౨౮ ప్ర॥ విపరీతజ్ఞానమనగానర్థమేమి?

ఉ॥ ఒకపదార్థమునుజూచి మరియొకపదార్థముగా భ్రమించుటయని విపరీతజ్ఞానమునకర్థము.

౧౨౯ ప్ర॥ అవిద్య కర్మ నెట్లుకలిగించును?

ఉ॥ జీవుడు ప్రథమంబున శరీరంబునుజూచి తానను కొని భ్రమిం

చును. అటుతరువాత (జనన, మరణాదులగు) శరీరగుణంబులనుజూచి తనకు సంబంధించినదిగా (తనగుణంబులని) భ్రమించును. ఈయజ్ఞానము ఆశ, అసూయ, కోపాదులను (రాగద్వేషాదులను) గలిగించును. మరియును వానిప్రాబల్యంబుచేత జీవుడు (మంచిలేకచెడుకర్మలకారణమగు) కొన్నిక్రియలకులోనగును. (సుకర్మలకుగాని దుష్కర్మలకుగాని కారణమైనకొన్నిక్రియలనొనర్చును.) ఈకర్మలు వాసనాజ్ఞానములమూలమున యితరక్రియలఁ బుట్టించును. తిరిగి. రుచివశంబున జీవుడు పలు తెరంగులుగల యితర (పదార్థముతో) ప్రకృతిచేబద్ధుడగును. ప్రకృతి తోడనైన యిట్టి సంబంధఫలము- అజ్ఞానమైయుండును, ఈయజ్ఞానము కర్మనుగలిగించును. ఈవిధంబునకర్మ నిర్ణితారంభమేమియు లేకుండగ సరిగానొకచక్రముతిరుగులాగున, అవిద్య (అజ్ఞానము) కర్మ, వాసన, (వాంఛ) రుచి (వాంఛ) ప్రకృతిబంధము (పదార్థసంసర్గ) అనునీవైధ్య ప్రధానాంశములతో పనిచేయును (చలించును) ఈయభిప్రాయమునందు, కర్మయు, ప్రకృతితోడి జీవసంబంధమును (కారణశరీరమును) నదీప్రవాహంబువలెనే యనాదియగు ప్రవాహానాడియని చెప్పఁబడును. ఇవి యేమధ్యకాలమునందైనను రావు. (కర్మకారణశరీరములు మధ్యమధ్యరావు) గానిజీవునితోగూడ ప్రళయమునందు సహాయాంతర్హితస్థితియందుండును (సూక్ష్మరూపంబుననుండును). తదనంతర పరిణామవ్యావృత్తి ప్రారంభించినపుడు (తదనంతరసృష్టిప్రారంభమైనపుడు) తిరుగ యివి విజృంభించి మునుపటివిధమున ఫలములనుగలిగించును (కర్మఫలము)

౧౩౦ ప్ర॥ దుష్కర్మచేయుటనుండి (దుష్కర్మచేయకుండగ) ఈశ్వరుండు జీవాత్మనేలయాటంకపరుపడేదు? (ఏలనిరోధింపజాలడు?)

ఉ॥ ఈశ్వరుండు ప్రత్యేకకారణము (వ్యష్టికారణము) కాడు గాని ప్రతిదానికిసమష్టి కారణమవును. గావున వ్యష్టిలక్ష్యప్రసమునుబట్టి పూర్వముగ నేమియు జేయకుండును (దృష్టగానుండును). మరియొకపక్షంబున ప్రతిజీవుడును ప్రత్యేకింపఁబడియున్నాడుగావున తనస్వకర్మఫలానుభవబాధ్యుడవును.

౧౩౧ ప్ర॥ దుష్కర్మయొక్క ఫలమేమి?

ఉ॥ నరకానుభవమును, ఈలోకంబునందు దుఃఖమును.

౧౩౨ ప్ర॥ నరకమనగా నేమి ?

ఉ॥ ఒకానొకస్థలంబునందలి యొకయవస్థ దీనియందుజీవాత్మ (పాపమను) దుష్కర్మయొక్క ఫలమునకుగాను శిక్షారూపమగు బాధ ననుభవించును ఇది మృత్యుదేవుడగు యమునిచే పాలింపఁబడును.

౧౩౩ ప్ర॥ నరకంబున బాధజెందునపుడు, జీవాత్మకేదేని శరీరంబుగలదా?

ఉ॥ ఉండును (కలదు) స్థూలశరీరంబునుండి సూక్ష్మశరీరమువేరైనతరువాతసూక్ష్మశరీరమునుండి కలిగిన నరకశరీరము లేక యాతనా దేహమను చిత్రమైన శరీర మొకటి కలిగియుండును.

౧౩౪ ప్ర॥ సుకర్మయొక్క ఫలమేమి?

ఉ॥ స్వర్గంబునందు సుఖానుభవమును, ఈలోకంబునందు సౌఖ్యమును

౧౩౫ ప్ర॥ స్వర్గమనగా నేమి?

ఉ॥ (ఊర్ధ్వలోక) ఒకానొకలోకంబునందలిసుఖావస్థ అచ్చటజీవాత్మస్థూలశరీరమునుండి సూక్ష్మశరీరము వేరైనతరువాత సూక్ష్మశరీరముచేగలిగిన యొకవిధమైన శరీరమునుధరించి యేవిధమైన దుఃఖమును లేకుండగ జీవాత్మసుఖమనుభవించును.

౧౩౬ ప్ర॥ ఊర్ధ్వలోకమనగా నేమి?

ఉ॥ భూలోకంబుననుండి సూర్యలోకపర్యంతము వ్యాపించియుండు భువర్లోకము ౧ సూర్యునినుండి ధ్రువనక్షత్రమువరకునుండు స్వర్లోకము ౨ మహర్లోక ౩ జనోలోక ౪ తపోలోక ౫ సత్యలోకము ౬ ఈ చివరి నాలుగులోకములును ధ్రువనక్షత్రమునుండి యీబ్రహ్మాండము యొక్క హద్దులపర్యంతము వ్యాపించియుండును. సామాన్యముగానీ లోకములు స్వర్గలోకములనియు పుణ్యలోకములనియు బిలువబడును

౧౩౭ ప్ర॥ (సంగతియెట్లున్నను) స్థిత్యనుగుణముగానరకంబునందైనను స్వర్గంబునందైనను జీవాత్మయెంతకాలమువరకునుండును?

ఉ॥ ఇట్టియవస్థలోనికి దీనుకొనివచ్చినకర్మయెంతవరకునుండునో యంతకాలమువరకునుండును.

౧౩౮ ప్ర॥ పితృలోకము, విష్ణులోకము, శివలోకము, నెచ్చట యుండు.

ఉ॥ అవి ఊర్ధ్వలోకములయొక్క కొన్నికొన్ని భాగములై యుండును.

౧౩౯ ప్ర॥ ఈబ్రహ్మాండముగాక మరియేవేని యితర బ్రహ్మాండములుగలవా?

ఉ॥ అనేకములుగలవు. ప్రతిదియు నీబ్రహ్మాండములోనుండున ట్లుగని చతుర్దశలోకంబులును, స్వర్గము నరకము, దానిదగుసూర్య చంద్రాదులును గలిగియుండు

౧౪౦ ప్ర॥ ప్రతిబ్రహ్మాండమునకును (హిరణ్యగర్భుడు, ఒకబ్రహ్మ గలడా?

ఉ॥ కలడు ప్రతిదియు నీబ్రహ్మాండమువలె నేర్పాటుజేయఁబడియుండును.

౧౪౧ ప్ర॥ ఈబ్రహ్మాండములు శాశ్వతములై యుండునా?

ఉ॥ ప్రతిదియు దానిబ్రహ్మయొక్క జీవితకాలాంతమున దాని యంత్యభూతములలోనికి మార్చఁబడును. అనేక (హిరణ్యగర్భులు) బ్రహ్మలు జీవించి యుండినవారు అనేకులింకనురానైయున్నారు.

౧౪౨ ప్ర॥ కర్మయీబ్రహ్మాండమునందువలె నితర బ్రహ్మాండములలోను పనిచేయునా?

ఉ॥ చేయును అదే విధమున పనిచేయును.

౧౪౩ ప్ర॥ ఈబ్రహ్మాండములన్నియు నేకకాలంబున ప్రళయాధీనములై యుండునా ?

ఉ॥ కావు ప్రతిదియు తనప్రళయము నితరమగువాని ప్రళయమునకంటె భిన్నమయిన కాలంబునఁగలిగియుండును. (ప్రతిదాని ప్రళయము నితరమగుబ్రహ్మాండ ప్రళయములకంటె విలక్షణమగు కాలంబునందు గలుగుచుండును). ఇందుకుసాదృశ్యముగ నీక్షణంబున నొక బ్రహ్మాండము ప్రళయమందుండవచ్చును. వేరొకటి తనసృష్టి నిప్పుడే ప్రారంభించును. ఇట్లుగనే తక్కినవికూడా.

౧౪౪ ప్ర॥ ప్రతిబ్రహ్మాండమును వేరొకదానికంటె భిన్నమైయుండునా ?

ఉ॥ ప్రతిదియును మహాదహంకారములతోఁగూడ వానియమిశ్రితావస్థయందుండు పంచభూతవిశిష్టమైన సప్తావరణంబులచేతను జుట్టుకొనఁబడియుండును (పరివేష్టింపబడు) కావున ప్రతిబ్రహ్మాండమును

వేరొకప్రతిదానికంటెనుగూడ ఒకయండము వేరొకయండమునకంటె వేఱైనట్టుగా భేదమైయుండును.

౧౪౫ ప్ర॥ బ్రహ్మాండములన్నియు వేరువేరు ఈశ్వరులు గలిగి యుండునా? ఈబ్రహ్మాండములన్నిటికి ప్రత్యేక ఈశ్వరులుందురా?

ఉ॥ లేరు ఉండరు. ఈ బ్రహ్మాండములన్నిటిని వ్యాపించి పరిపాలనమొనర్చు (పరబ్రహ్మ) నీశ్వరుండొక్కడు (మాత్రము) గలడు.

౧౪౬ ప్ర॥ ఈబ్రహ్మాండములన్నియు నేకప్రకృతి (మూలప్రకృతినుండియే) కలిగింపఁబడియున్నవా?

ఉ॥ అవును ప్రకృతియనంతమైయుండును. దానియొక్క యనేకభాగంబులందు సృష్టిజరుగుచుండును. అనేక బ్రహ్మాండములు సృష్టిలో వానియొక్క నియతక్రమంబున జనించుచుండును ఎక్కడసృష్టిలేదో యట్టి ప్రకృతియొక్క ఆభాగములందు నేమియుజరుగదు. మరియు నచ్చట నిర్వ్యాపారముగుబయలు (ఆకాశము) మాత్రముండును.

౧౪౭ ప్ర॥ స్వర్గనరకంబు లనుభవింపబడినతరువాత జీవాత్మకేమి సంభవించును?

ఉ॥ అది స్వర్గనరకంబు లనుభవించిన శరీరంబులనువిడిచి దానికర్మాకర్షణ ప్రాబల్యానుగుణముగు (స్థూలశరీరమును) ప్రకృతిశరీరమును ధరించును. ఈ (పద్ధతి) క్రమము చివరకిది మోక్షమునుసంపాదించి యివ్విధముగ పునర్జన్మరాహిత్యము నొందువరకును తిరిగి తిరిగిజరుగుచుండును

౧౪౮ ప్ర॥ సత్కర్మచేత సమస్తోర్ధ్వలోకానుభవమును నియమితక్రమము లేకగలుగునా?

ఉ॥ కలుగదు. సుఖానుభవము ఒక్కొక్కలోకంబునందు సత్కర్మయొక్క స్వభావమునకును మేరకును దగినట్లుగ అనుభవింపఁబడును.

౧౪౯ ప్ర॥ ఊర్ధ్వలోకంబునందు నెవరువసింతురు? వారచ్చటనేమిచేయుదురు?

ఉ॥ హిరణ్యగర్భుడు, రుద్రుడు, ఇంద్రుడు, అగ్ని మొదలగువారివంటి దేవతలు. వారిలో ప్రతివారును వారివారి స్వకీయమగు నధికారములు గలిగియుందురు. అనగా హిరణ్యగర్భుడు ప్రజాపతులచేత సృష్టికార్యములఁ జూచుచుండును.

౧౫౦ ప్ర॥ ఈదేవతలందరు నేకలోకంబునం దొక్కస్థలంబునం దేవసింతురా?

ఉ॥ ప్రధాన దేవతలలోఁ బ్రతివారును తమస్వకీయమగు నాయా లోకంబుల జీవించుదురు. అక్కడ తనయధికారము తనకంటెతక్కువగదేవతలఁకు గలిగియుండు.

౧౫౧ ప్ర॥ వారు తమకార్యములను పరబ్రహ్మకంటె(పరబ్రహ్మాధీనులుగాకుండగ) ప్రత్యేకముగా నెరవేర్చుచుందురా?

ఉ॥ లేదు. వారందరుపరబ్రహ్మమునకు పరతంత్రులు(అధీనులైయుందురు).

౧౫౨ ప్ర॥ ఈదేవతలుసర్వకాలమును జీవింతురా?

ఉ॥ జీవించరు. (హిరణ్యగర్భుని జీవిత కాలమగు) మహాకల్పాంతమందు దేవతలందరు తమశరీరంబులవిడిచి హిరణ్యగర్భునితోఁగూడ మోక్షమునొందుదురు.

౧౫౩ ప్ర॥ అటులైనచోఁ దదనంతర మహాకల్పమందువారిస్థానంబులనెవరుచేకొందురు.

ఉ॥ ఇంద్రునియొక్కయునింక నితర దేవతల యొక్కయు స్థానమును (స్థితిని)సంపాదించుకొనగలుగు సంతతి పరిమితసత్కర్మ(పుణ్యము) పరిమితముగలుగునట్టి జీవులు

౧౫౪ ప్ర॥ మోక్షమనగానేమి?

ఉ॥౧ కైవల్యము ౨ బ్రహ్మానందము అనురెండువిధములుగలవు కైవల్యమనగా జీవునియదార్థదశయందు జీవునిచే ననుభవింపఁబడు పరమసుఖానుభవము. బ్రహ్మానందమనగ జీవునిచేతపరబ్రహ్మమువలె ననుభవింపఁబడు పరమ సుఖానుభవము. అనగ దానినిపరబ్రహ్మమనుభవించువిధమునయుండు సుఖానుభవము. ఇది సాయుజ్యమనిగూడఁ బిలువఁబడును.

౧౫౫ సాయుజ్యమనగా, పరబ్రహ్మమందుజీవునియొక్క లయముకాదాఅనగా పరబ్రహ్మముతో జీవుడు పూర్ణముగా నైక్యమగుట కాదా?

ఉ॥ కాదు. జీవుడు పరబ్రహ్మముతో(మిశ్రములేకుండా)కేవలముగా నైక్యముకాదని నేనిదివరకే చెప్పియున్నాను. సాయుజ్యమన

గా వేదమందువివరింపబడిన విధంబున పరబ్రహ్మముతో గూడ సమముగ బ్రహ్మానందానుభవముఁ బొందుటయని యర్థమిచ్చును. ఇదిసాలోక్య సారూప్యములనుఁగూడుకొనియుండును.

౧౫౬ ప్ర॥ సాలోక్యమనగానేమి?

ఉ॥ సాలోక్యమన కేవలమొక స్థలంబునందే నివసించుటయని యర్థము.

౧౫౭ ప్ర॥ సారూప్యమనగానేమి?

ఉ॥ సారూప్యమనగా శుద్ధసత్వముచే నేర్పడునట్టి ఈశ్వరశరీర సదృశ్యమగు శరీరముగలిగియుండుటయని యర్థమిచ్చును.

౧౫౮ ప్ర॥ ఒకసారి మోక్షమునుసంపాదించినపిమ్మట జీవుడెప్పుడైన బద్ధుడగునా? (బంధుడగునా?)

ఉ॥ కాదు మోక్షము శాశ్వతమైనదని నేనిదివరకే. చెప్పియున్నాను (మోక్షమును సంపాదించియున్న జీవులు) ముక్తులు తిరుగ నికనెన్నడును ప్రకృతిగుణంబులకేని కర్మకేని బద్ధులు కారు. కాని లోకమునకు మేలుచేయుటకొరకై వారుయిష్టపడుదురేని వారు తామే యవతరింపవచ్చును అట్టియవతారానంతరము వారు మోక్షమునకు దిరిగిపోఁబోదురు. మరియు నీయవతారములలో గూడ వారు ప్రకృతికిగాని కర్మకుగాని బద్ధులుగారు.

౧౫౯ ప్ర॥ మోక్షమనగా స్వర్గమునంటి యొకానొక స్థలమందు సుఖానుభవమునొందునట్టి యొకయవస్థయేనా?

ఉ॥ అదిప్రాకృతంబుగాక శుద్ధసత్వముచేయఁబడి (అత్యున్నతావస్థ లేక వైకుంఠ) పరమపదమని పిలువబడు నొకప్రదేశమందు నది యనుభవింపబడును. అది ప్రాకృతలోకములకన్నిటికంటె నూర్ధ్వమందుండును. కైవల్య బ్రహ్మానందములను ద్వివిధములగు మోక్షములును వైకుంఠలోకమునందే యనుభవింపబడునుగాని (వైకుంఠము) దాని యొక్క వేరువేరుభాగములందనుభవింపబడును.

౧౬౦ ప్ర॥ మోక్షముయొక్క ముఖ్యాంశములేవి? (పరమ ధర్మములు)

ఉ॥ ప్రకృతిసంబంధమంతటినుండి జీవునిపూర్ణముగాఁ బత్యేకించుటయు, మంచిదిగాని, చెడుదిగాని యగునట్టి కర్మను పూర్ణముగా

నశింపజేయుటయు, మోక్షమను శబ్దము బంధమునుండి విముక్తియని యర్థమిచ్చును.

౧౬౧ ప్ర॥ ఈసారాంశము లెచ్చోటసంపాదింపఁదగియుండును?

ఉ॥ ప్రాకృతవిశ్వావరణమున కవతలనుండు (నత్యున్నతస్థానమగు) పరమపదములోనికి జీవునియొక్క ప్రవేశమునకు పూర్వమందే.

౧౬౨ ప్ర॥ బ్రహ్మానందానుభవమునందు ముక్తులలో నేదేని భేదముగలదా?

ఉ॥ లేదు. పరబ్రహ్మయొక్క సుఖానుభవమునకైనను ముక్తులసుఖానుభవమునకైనను ఏభేదమును లేదు.

౧౬౩ ప్ర॥ ఈమోక్షము నిషేధములేక (అపవాదములేక) ప్రతిజీవునిచేతనుగూడా పొందఁదగినదైయుండునా?

ఉ॥ అట్లనుభవించుటకుఁ దగియుండులేని సర్వజీవులు మోక్షము నొందగలరు.

౧౬౪ ప్ర॥ ఈ లోకమునుండి పరమపదము లేక వైకుంఠమునకు మార్గమేదైనగలదా?

ఉ॥ కలదు. అది వేదమందు అర్చిరాదిగతి యనిగాని దేవయానమనిగాని పిలువఁబడును. మోక్షమునొందు పురుషునియొక్క మరణముతటస్థమగునేని, హృదయమును బ్రహ్మరంధ్రముతో సంబంధింపఁజేయు నొకనాడి (మజ్జాతంతువైన) సుషుమ్నను అంటిపోవుచు హృదయమునుండి (మధ్యనుండి) శిరోపరిభాగమందుండు బ్రహ్మరంధ్రమువరకు జీవుడు సూక్ష్మశరీరముతోఁబోవును. జీవుడు బ్రహ్మరంధ్రముగుండా భేదించుకొని సూర్యకిరణములద్వారా సూర్యమండలమునకు వెళ్ళును. అంతటయది సూర్యునియందలి నల్లనిమచ్చగుండా పరమపదమునకుఁ బోవును.

౧౬౫ ప్ర॥ జీవుడు పరమపదమునకు వెళ్ళుమార్గమునుగురించి ఇంకనుకొంతసంగతిని దయచేసి నాకుఁజెప్పుడు?

ఉ॥ (యోగలభ్యమగు) యోగముచేలభించిన (పరమ) దివ్యజ్ఞానముచేత జీవుడు పరమపదమునకుఁ బోవుతనమార్గమందు (నడిపింపఁబడును) గొనిపోబడును. అర్చి, అహస్, పూర్వపక్ష, ఉత్తరాయణ, సంవత్సర, ఆదిత్య, చంద్ర, వైద్యుత, వరుణ, ఇంద్ర, ప్రజాపతులనా

షములచేఁ దెలియఁబడు (మార్గవాహకులు) నధివాహికులసహాయముచేతను చివరివారగు ముఖ్యులును విష్ణ్వవతారమునగు అమానవ సహాయముచేత జీవుడిట్లు పరమపదమునకుఁ బోవును. అర్చులును, ఇచ్చటఁ జెప్పఁబడిన యితరులును కొన్నినిర్మలాత్మలు గాని సామాన్యమగు రాత్రిము దివము, మాసము, సంవత్సరము వాయువు మొదలగునవి కావు,

౧౬౬ ప్ర॥ మోక్షమును సంపాదించు నుపాయము లేవి? (సాధనము లేవి)?

ఉ॥ కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము, ప్రపత్తి, యనునాలుగు (సాధనములు) ఉపాయములుగలవు.

౧౬౭ ప్ర॥ కర్మయోగమనగా నేమి?

ఉ॥ కర్మయోగమనగా అత్యాజ్యమైన విధులగాను శ్రుతుల మూలముగా (చిత్తు, అచిత్తు, ఈశ్వరుడను, తత్వత్రయముయొక్క సత్యమైన జ్ఞానమును) తత్వజ్ఞానమును సంపాదించినతరువాత కర్మఫలమందు స్వప్రయోజనమేమియు లేకుండగాను, (నీతివిషయమైనట్టియు, మతవిషయమైనట్టియు) విధులను ఆచరించుటయనియు, సర్వదా పరమాత్మను దృష్టియందుంచుటయనగా (జప, హోమ, యజ్ఞ, దాన, తపాదులుఅను) వివిధకర్మములయందు పరమాత్మను ధ్యానించుటయనియు కర్మయోగమనుదానికి తాత్పర్యము.

౧౬౮ ప్ర॥ జ్ఞానయోగమనగా నేమి?

ఉ॥ (యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ సమాధి) యనునష్టాంగములతోడను, యోగశాస్త్రములందు వివరింపబడినమనోనిశ్చలత. కర్మయోగజ్ఞానయోగములను నీరెంటిచేతను జీవాత్మయొక్క యధార్థజ్ఞానము సిద్ధించును. లేక కర్మజ్ఞాన యోగములలో దేనిచేతనైనను అట్టిజ్ఞానముసిద్ధించవచ్చును. మరియునీ రెండును (కైవల్యబ్రహ్మానందములనునుభయవిధ) మోక్షముగ దెలియబడు ఫలమును గలిగించును.

౧౬౯ ప్ర॥ భక్తియోగమనగా నేమి?

ఉ॥ అది ఉపాసనయనిఁగూడ పిలువఁబడును. అదియొకని యావజ్జీవితకాలమునూ ఏవిధమైనవిఘ్నములు లేకుండఁగ పరబ్రహ్మముయొక్క

వివిధములగు గుణములతోడను లక్షణములతోడను పరబ్రహ్మమును ధ్యానించుటయు, నాకాలమునందే తనశక్తికొలదిని తనవిధులను నెరవేర్చుటయునై యున్నది, ఈభక్తియోగము (జ్ఞానయోగముయొక్క సమస్తనియమములతోడ గూడజ్ఞానయోగముయొక్క సహాయముచేత నాచరింప (అభ్యసింప) బడవచ్చును. భక్తియోగముఁగూడ (కైవల్యబ్రహ్మానందమునను నుభయ) మోక్షమునుసిద్ధింపఁజేయును.

౧౨౦ ప్రః భక్తియోగమునభ్యసించుటకు నొకనికి నేయేయోగ్యతలు గావలసియుండును?

ఉః సాధనసప్తకమని పిలువఁబడు నేడుసాధనములు (యోగ్యతలు)దానికి గావలసియుండును. అవియేవనగా—

౧ వివేకము భగవద్గీతయందును ఇంకనితర యోగశాస్త్రములందును వివరింపఁబడిన (వర్ణింపఁబడిన) విధమున మనస్సుయొక్క యేకాగ్రతను సులభపరచు (వృద్ధిచేయు) నట్టియాహారమునే యనగా (సాత్వికాహారము) మాత్రమె పుచ్చుకొనుటచేత ధ్యానముకొరకైన మనోనిర్మలత యనువివేకము.

౨ విమోహము- సమస్తవాంఛలను పరిత్యజించుట యనువిమోహము.

3 అభ్యాసము- ఒకపదార్థముమీాది ధ్యానమునందు విఘ్నములేకుండుటయను నభ్యాసమును.

౪ క్రియ- తనశక్త్యానుసారముగ వేదములందుఁ జెప్పఁబడిన తనవిధులను నెరవేర్చుట యనుక్రియ

౫ కల్యాణము- సత్యాన్వేషణము, కృప, దానాది కల్యాణము.

౬ అనవసాదము- ఎట్టియవస్థయందైనను దుర్దశలు (నిడుములు) దుఃఖములను నిర్లక్ష్యపెట్టుట యను అనవసాదము.

౭ అనుద్ధర్షము- తనకుగల యవస్థతో తృప్తిఁజెందుట యనుఅనుద్ధర్షణము.

౧౨౧ ప్రః భక్తియోగముచేత పరబ్రహ్మమును మనమెట్లుధ్యానింపవలసియుండును?

ఉః "అహంబ్రహ్మాస్మి" వలెనే ఇది(వుత్పత్తిచేత) శబ్దార్థమును బట్టి "నేను బ్రహ్మనగుదును" అనగానాయాత్మ బ్రహ్మమగును(అనివైన

నులేక) అనగా (జీవుడనైన) నేను, అనేక యితరగుణములు-లక్షణము లుగల పరబ్రహ్మముయొక్క యొకగుణమును లేక శరీరమును అగుదు నని ఇదియర్థమిచ్చును.

౧౭౨ ప్ర॥ ఒకవిధమైన భక్తియోగముకంటె వేరువిధము లుండునా, (అనేకవిధభక్తియోగములుగలవా?)

ఉ॥ కలవు. అదిరెండువిధములైయుండును.

ప్రతీకోపాసన, అప్రతీకోపాసన. మొదటిదగుప్రతీకోపాసన ప్రణవ మును ఇంకను పరబ్రహ్మముకంటే భిన్నములగు నితరములను గూర్చి పరబ్రహ్మముగా ధ్యానించుట. (ప్రణవమునింకను పరబ్రహ్మమునకం టెభిన్నములగు కొన్ని యితరములనుగూర్చి పరబ్రహ్మముగా ధ్యా నించుట) మరియునిది మధువిద్య, ఉద్గీతవిద్యాదులను గూడియుండును. రెండవదియగు అప్రతీకోపాసన సరియగు పరబ్రహ్మముయొక్క ధ్యాన మైయుండును. మరియునిది దహరవిద్యా, సద్విద్యా, న్యాసవిద్యాదు లను గూడియుండును.

౧౭౩ ప్ర॥ అటువంటివిద్యలయొక్క సంఖ్యయంతయు నెంత?

ఉ॥ ముప్పదిరెండు, మరియునవియన్నియు (బహువిరళముగా) విశేషవిరములతో నుపనిషత్తులయందు వివరింపఁబడియున్నవి

౧౭౪ ప్ర॥ ఈవిద్యలలోనేమిభేదముండును?

ఉ॥ పరబ్రహ్మ ధ్యానమునుగురించి యాలోచించినంతవరకు. భేదమేలేదు. పరబ్రహ్మముయొక్క విశేషణములగురించియు, గుణము లగురించియు ధ్యానించుటవిషయమైనమాత్రమే భేదముగాన్పించును.

౧౭౫ ప్ర॥ ఈవిద్యలు మోక్షమునెట్లుగలిగించును.

ఉ॥ ప్రతీకోపాసన మొదటమోక్షమునకంటె వేరగుప్రయోజ నములనుగలుగఁజేయునుగానితరువాత నీప్రయోజనముల (ఫలముల) ద్వారా మోక్షమునుగలుగఁజేయును. అప్రతీకోపాసన దానినభ్యసిం చువానియొక్క యిచ్ఛానుసారముగా మోక్షమునేని లేక ఆచరించు యితరసత్ఫలములనేని (ప్రయోజనములనేని) కలుగఁజేయును.

౧౭౬ ప్ర॥ ఆయాపురుషుడు ఈశ్వరునియందు నిండుభక్తిగల వాడు, ఆయనకైకీర్తనలుపాడును అని మనముచెప్పినపుడు, భక్తియన గానేమని యర్థమిచ్చును?

ఉ॥ ఇదిఅదిసామాన్యముగా (శ్రద్ధ, భక్తి) అనియర్థమిచ్చును. కీర్తనలుపాడుట, పుష్పాదులసమర్పించుట, యివియీశ్వరునియెడల యొకనికిగల బహిరంగచిహ్నములు మాత్రమేయైయుండును. అవిభక్తియైయున్నప్పటికి ఇంకనవిక్రమముగాభక్తియోగముక్రిందఁ జేరవు.

౧౭౭ ప్ర॥ ప్రపత్తియనగానేమి?

ఉ॥ పైనుదహరింపఁబడినసమస్తేతరమోక్షసాధనములను(ఉపాయములను) బరిత్యజించి ౧ దానికంటెనితరమగు మూడుసాధనములలో దేనినైననభ్యసించుటకునోకడు తానుఅసమర్థుడనసమాత్రమేయోచించుట, ౨ తానుమృతినొందువరకు, ఈశ్వరుని యిష్టమునకు వ్యతిరేకమగు దేనినైనఁజేయక, రక్షకునిగా ఆయనయందు విశ్వాసముంచిఆయన విశేషణములన్నిటితోడను గుణములన్నిటితోడను ఈశ్వరుడేతనకురక్షకుడని ధ్యానించుట

౧౭౮ ప్ర॥ దీనియందు ధ్యానింపఁబడఁదగిన గుణము లెవ్వి?

ఉ॥ జ్ఞాన, శక్తి బల, ఐశ్వర్య, వీర్య, ఆనందదయా. వాత్సల్య, సౌలభ్య, సౌశీల్య, మరియునింక తనశరీరంబుగనుండు, అచిత్తు, చిత్తు, విశ్వముతోగూడ వేదమందు వివరింపఁబడిన యితరంబులును (యితర గుణములు) ఇంకను ఈశ్వరునితోఁగూడ సదాయుండునట్టి(దనాధిదేవతయగు)లక్ష్మితోడ తనయిచ్ఛచేత ధరించిన దివ్యశరీరమును.

౧౭౯ ప్ర॥ ఈనాలుగు మోక్షసాధనములన్నియు సమానముగాయోగ్యమైనవేనా (సంగతమైనవేనా?)

ఉ॥ విశేషమైన మనోవికాసము (మనోభివృద్ధి) గలిగినట్టియు (ఆత్మజ్ఞానము) జ్ఞానముగలిగినట్టియుమనుష్యులుమాత్రమే కర్మయోగ, జ్ఞానయోగ భక్తియోగములను మొదటిమూటిని అభ్యసింపఁదగియుందురు. మనోవికాసముగాని (మనోపరిపక్వమునుగాని) ఆత్మజ్ఞానముగాని లేనట్టివారును, మోక్షముయొక్క యితరసాధనములనభ్యసించ నసమర్థులగువారును ప్రపత్తినవలంబించనచ్చును. ఇది కుల, మత (ఆచార) భేదంబులేకఎవనిచేతనైనను, పాపుచండాలుడైనను, లేక మ్లేచ్ఛుడైనను తానుస్వయముగాగాని లేకతనకుదగిన యాచార్యునిచేతగాని యభ్యసింపఁబడవచ్చును.

౧౮౦ ప్ర॥ మోక్షమునుసంపాదించుటను గూర్చిన యీసాధ

నములను అభ్యసించునట్టివానియందుండవలసిన యోగ్యతలేవి?

ఉ॥ ౧ సమర్థతగల యాచార్యునివలన అచిత్తు, చిత్తు, ఈశ్వరులను గూర్చిన యథార్థమైన జ్ఞానము (తెలివి)

౨ ఈయాచార్యునియెడలప్రేమ (భక్తి)

3 వేదములందువిశ్వాసము.

౪ మోక్షమందువాంఛ(మోక్షేచ్ఛ)

౫ వైరాగ్యము- అనగా ప్రాపంచకవాంఛలను కోరికలనునిర్మూలముజేయుట.

౬ విధియందుశ్రద్ధ.

౭ వేదమునుగాని లేకఆత్మగ్రంథములనుగాని (స్వరూపగ్రంథములను) ఏభాషయందుండినవైనను వేదాంతగ్రంథములనుగాని లేక స్వరూపగ్రంథములనుగాని చదువుట, దుస్సాంగత్యమును, ఏవిధమైనస్వప్రయోజనమును. పరిత్యజించుట.

౧౮౧ ప్ర॥ వేదమందు విధింపఁబడిన రీతిగా నాచారకర్మలను జేయుటకు దగియుండనివారు ఈసాధనముల నెట్లుఅభ్యసింపవలెను?

ఉ॥ అటువంటివారు స్మృతులచేత తమకై విధింపఁబడినవాటిని నెరవేర్చుకొనవచ్చును. మరియు నాకాలమందే, కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము, అని పరిభాషగా నుపాయములని పిలువఁబడిన వీనిలోదేనినయిన నవలంభించవచ్చును.

౧౮౨ ప్ర॥ ఈసాధనములు కర్మను పూర్ణముగా నశింపజేయుటకు సామర్థ్యముగలవేనా?

ఉ॥ అవును. అవి మంచిదియు చెడుదియునగు త్రివిధకర్మను నశింపజేయును.

౧౮3 ప్ర॥ కర్మయొక్క త్రివిధములేవి?

ఉ॥ ౧ సంచిత- మరియొకకర్మయొక్క పనిజరుగుటంజేసి యేవిధఫలమును గలిగించుటకైన ప్రారంభించియుండనికర్మ.

. ౨ ప్రారబ్ధ- ఫలములగలిగింపఁనిదివరకే ప్రారంభించియుండుకర్మ.

3 ఆగామి- ఈసాధనములయొక్క యభ్యాసముప్రారంభమైయున్నతరువాత భావికార్యముల ద్వారాభవిష్యత్కాలమును పనిచేయనున్నకర్మ. ఈసాధనములచేత సంచితకర్మ నశింప జేయబడును. ప్రార

బ్ధకర్మ దానిఫలములఁ గలుగఁజేసి యటుపిమ్మటమాని వేయును. ఆగామికర్మ యీసాధనములచేత నెంతమాత్రము నేవిధఫలమునుగలిగింపకుండగ నిరోధింపఁబడును.

౧౮౨ ప్ర॥ ఏదేని యొకజన్మమందునీసాధనములు నభ్యసించు నొకమనుజుడు ఆజన్మముయొక్క అంత్యమందు (ఆశరీరమునందు) మోక్షమును బొందునా?

ఉ॥ జన్మనుంచిజన్మకు నామనుజుని నడిపించువాని ప్రారబ్ధకర్మముయొక్క స్వభావముతో సదిసంబంధించియుండును. ఒకజన్మాంతమందుగాని యనేకజన్మాంతములందుగాని యిదితటస్థమగునప్పటికి ప్రారబ్ధము పనిచేయుటమాని యున్నపుడు ఒకమనుజుడు మోక్షమునుబొందును. కానిప్రవృత్తినవలంభించి ఆజన్మాంతముచేతనే (ఆజన్మాంతములోపుననే) సమస్తకర్మఋణముపూర్తిగ చేయునటువంటివాడు, అప్పటినుండి మోక్షమునుబొందును. ఒకడు మోక్షమునొందుట కర్హుడగునపుడు సంచితము పూర్తిగ నశించును ఆగామి నిష్ఫలమైపోవును. ప్రారబ్ధమును దానిఫలములతోగూడ దరిగిపోవును. (క్షీణించును.) ఇట్లు ప్రకృతిసంబంధకారణమగుకర్మ, (ప్రకృతితోడ బంధకారణమగు) కర్మ, ఈనాలుగుసాధనములచేతను నశింపఁజేయఁబడును.

౧౮౩ ప్ర॥ మోక్షమును సంపాదించుకొనుటకై హిరణ్యగర్భుడు మహాదేవుడ, నింకనితరదేవతలను, శక్తి మొదలైనవాటివంటి స్త్రీదేవతలను ధ్యానించుటకు నీసాధనములుపయోగింపఁబడవచ్చునా?

ఉ॥ కూడదు. ఏలయనిన నీదేవతలు మహాత్మయును, పరమాత్మయును ఈశ్వరుడునుకావు. (పరమపురుషుడును పరమాత్మయును ఈశ్వరుండునగు పరబ్రహ్మము కావు.) వారుసత్కర్మలచేలభించిన కొన్నిశక్తులనుగలిగి ప్రత్యంశమందును బ్రహ్మమునకు లోబడియుండునట్టి జీవులుమాత్రమేయగుదురు. మోక్షమునకై ధ్యానింపఁబడదగినదానిలో ముఖ్యములైన యావిశేషణములు గుణములు వారుగలిగియుండరు. వారుకర్మప్రకృతులకు నధీనులగుదురుకావున యొకపురుషునికర్మనుపూర్ణముగనశింపఁ జేయుటకుకాని ప్రకృతినుండి జీవునిపూర్ణముగ వేరుచేయుటకుగాని యిట్లుతమవలె నమానబంధమునందుండిన జీవాత్మలకుపరమానందమును ఇచ్చుటకుకాని వారుఅసమర్థులు. ఏకపరమాత్మయా

విశ్వకారణమును, సర్వవిశేషణములకు గుణములకు, మూలమును, వదాలక్ష్మితో నుండువాడును, సర్వవ్యాపియు, సర్వజ్ఞుడును, సర్వసాక్షియు, సర్వశక్తుడును, విష్ణు, వాసుదేవ, నారాయణవంటినామములచే జెప్పఁబడువాడునగునా మహాదైవము మాత్రమే దేవుడు, ఆయనద్వారా మోక్షము లభ్యముగాఁగలదు ఆయనయొక్కడే సర్వాత్మలకు రక్షకుడు. శ్రీ శ్రీ శ్రీ

స మా ప్త ము.

---

శ్రీ

ఈగ్రంథమునందలి

ప్రశ్నములయొక్క విశేషాంశములు.

ప్ర॥ 3 శ్రీకంఠశివాచార్యులు తనమతానుగుణ్యముగా బ్రహ్మసూత్రములపై నీలకంఠభాష్యమని పిలువఁబడు నొకభాష్యమును వ్రాసెను. ఈభాష్యముపై శివార్కమణిదీపికయను అప్పయదీక్షిత విరచితమగు భాష్యమొకటిగలదు అందుపైనే హరదత్తునిచేతను, అప్పయదీక్షితునిచేత నిఁకనితరులచేతను వ్రాయఁబడిన చతుర్వేదతాత్పర్యనిర్ణయ, శివతత్వవివేకము మొదలగు నితర లఘుభాష్యములుగలవు. క్రీస్తు తరువాత, శ్రీకంఠశివాచార్యులు ౯ వ-శతాబ్దమందును, హరదత్తుడు ౧౧ వ- శతాబ్దమందును, అప్పయదీక్షితుడు సుమారు ౧౬ వ-శతాబ్దముయొక్క చివరను జీవించిరి.

ప్ర॥౭ కేశవసోమయాజి, శిక్ష- యజుర్వేదముయొక్క శ్రోతలపైన ననేకగ్రంథములను జేసిరి. వానిలోన నేకము సామాన్యములుగా కేశవీయములుగా దెలిసికొనఁబడును.

ప్ర॥ ౧౬ వ్యాసునియొక్క శిష్యుడును ఋషియునగుభోధాయనుడుఆపస్తంబునివలె కల్ప, గృహ్య, ధర్మసూత్రములుఅను వానిని, బ్రహ్మసూత్రములపై లక్షగ్రంథముగల బోధాయనవృత్తియను మహాభాష్యమునొకదానిని రచించెను వారిభాష్యములందు శంకరాచార్యులచేతను రామానుజాచార్యులచేతను గూడ సంబంధము చూపఁబడియున్నది.

౨ ద్రమిడాచార్యుడు ద్రమిడభాష్యమనఁబడు బ్రహ్మసూత్రముల

పైని యొక భాష్యముకు కర్త. ఈయనతరుచుగా శంకరాచార్యుల వారి చేతగూడా తన భాష్యమందునుదహరింపఁబడియున్నాడు.

3 వాక్యకారయని గూడపిలువఁబడు బ్రహ్మనంది బ్రహ్మసూత్రముల పై యొకవృత్తినివ్రాసిరి.

४ ఆచార్యభారుచి యనునాతడు ధర్మశాస్త్రములకు వ్యాఖ్యవ్రాసినవాఁడు. తనమితాక్షరియందు విజ్ఞానేశ్వరునిచే సంబంధము చూపఁబడెను. ఈయనకూడా బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానము చేసెను.

౫ ఆచార్యకపర్ధియను నతడు బ్రహ్మసూత్రముల పైని ఆపస్తంభ కల్పసూత్రముల పైని వ్యాఖ్యాన మొనర్చెను.

౬ ఈశ్వరమునియొక్క కుమారుడగు నాథముని విశిష్టాద్వైతసిద్ధాంతముపై యొక వేదాంతగ్రంథమగు న్యాయతత్వమనుగ్రంథమును, యోగశాస్త్రమందుండిన రహస్యతత్వముపైన యోగరహస్యమను గ్రంథమును జేసెను. ఈయన (క్రీ ౯) శతాబ్దమున దక్షిణహిందూస్థానమందు జీవించియుండిరి.

౭ త్రిదండసన్యాసియగు యామునాచార్యులు, ఆత్మసిద్ధి, ఈశ్వరసిద్ధి, సంవిత్సిద్ధి ఆగమప్రామాణ్యము నింక నీవేదాంత సిద్ధాంతము పైన యితరగ్రంథములను వ్రాసిరి. మరియు నీయన (క్రీ. ౧౧) శతాబ్దము ప్రారంభమున దక్షిణహిందూస్థానమందు తేజరిల్లిరి.

ప్ర॥ ౨౧ శ్రీరామానుజాచార్యులువారు ఉపదేశ మొందినరహస్యము, ప్రసిద్ధమగు అష్టాక్షరియైయుండెను అంతరార్థమునుగూర్చి చెప్పగా, అవశ్యముదానియర్థమును ఎవరేనియోచింపఁదగియుండును.

ప్రా॥ ౨౫ శ్రీశంకరాచార్యులవారియొక్కయు, శ్రీరామానుజాచార్యులవారియొక్కయు శ్రీమధ్వాచార్యులవారియొక్కయు శరీరములనువలె అట్టిమహాజనులశరీరములను బూజించుటయొక్కయుద్దేశ్యము, వారియొక్క దివ్యతేజస్సు వ్యాపించిపోకుండగ నొకచోగూడియుండునటులఁ జేయుటయనునదే.

ప్ర॥ ౨౬ కంచి యిప్పటికైనను ముఖ్యముగా నీకారణముచేతను, ఇంకనుమరియొక గొప్పవైష్ణవగురువగు వేదాంతాచార్యులయొక్క జన్మస్థానమగుటచేతను వైష్ణవమతమునకు గొప్పమధ్యరంగముగానున్నయది.

ప్ర॥ ౩౫ (క్రీ. ౧౧౧౪, ౧౧౩౭) విష్ణువర్ధనుని రాజధానియగు, ద్వారసముద్రముయొక్క శిథిలములపై గట్టబడిన యిప్పటి హలెబాదు సమీపమున, ఆయనయీ వైష్ణవమత మవలంబించుటనుగూర్చియు, (క్రీ. ౧౧౧౭) కలిగినట్టియు నొక లేఖనముగలదు. ఇంకను తిరునారాయణపురమునందలి దేవాలయము యెప్పుడునిర్మింపఁబడెనో దానిని దెలుపుటకై యాయాలయమునందే మరియొక లేఖనముగలదు.

ప్ర॥ ౪౧ అక్కడిపండితులచే నంగీకరించబడినట్టియు శ్రేష్ఠమైనట్టుభావింపబడినట్టియు గ్రంథములనుమాత్రమే యట్టిపుస్తకభాండాగారములోనికి దీసికొనుట శ్రీనగరమున నాకాలమందు వాడుకై యుండెను. శ్రీభాష్యకారా యనగా భాష్యమును జేసినవారనియర్థమగును ఆయనతండ్రిగారు పెట్టినపేరు లక్ష్మణాచార్యులై యుండెను. అదియును శ్రీరామానుజాచార్యులవంటిదే. రెండును రామసోదరుడనియర్థమిచ్చును

౪౬-౪౭-౪౮- ప్రశ్నలనుగురించి అనుబంధమునుజూడనగును.

ప్ర॥ ౫౦ "ఆళ్వారులు" అనునది తమిళ్ శబ్దము. అవయవార్థముచే ఆత్మసంబంధమైన ప్రభువులనియర్థము (పారమార్థిక ప్రభువులు) వారలెవ్వరనగా.

౧- (పాంచజన్యాంశమగు) పొయిఘయాళ్వారులు, కలియుగమునకు పూర్వము ౧౮౦౩వ సిద్ధార్థినామసంవత్సరమున కాంచీనగరమందలి యొకతటాకమునందు జనించిరి వీరుఅయోనిసంభవులు.

౨- (గదాంశాసంభూతులగు) పూదత్తాళ్వారులు, పొయిఘయాళ్వారుల జననమునకు మరుచటిరోజున సప్తాలయములనియిప్పుడు పేర్కొనబడు గ్రామమందుజన్మించిరి.

౩- (నందకాంశాసంభూతులగు) పేయాళ్వారులు, పొయిఘయాళ్వారులజననమునకుపిమ్మటమూడవరోజున(చెన్నసగరము) మైలాపురమునందు నొకతామరకమలమందు నవతరించిరి. ఈముగ్గురును, దక్షిణఆర్కాడుజిల్లాలోని తిరుకోవలూరునందు సమావేశమైనట్లుచెప్పబడియున్నారు.

౪- (చక్రాంశాసంభూతులగు) తిరుమడిశయాళ్వారులు, పైన జెప్పిన యాసంవత్సరమందేయవతరించి ౨౩౦౦ సంవత్సరముల పర్యంతము సమాధియందునుండి యున్నట్లుచెప్పబడెను.

౫- (విష్వక్సేనాంశాసంభూతులగు) నమ్మాళ్వారులు, కలియుగ ముయొక్క ౪౩-వ సంవత్సరమున తిరునల్వేలిమండలములో నాళ్వారు తిరునగరిసమీపమున తిరుకురుకై యనుగ్రామమందు శూద్రకులంబున జన్మించిరి-ఆయన బాల్యమునందే యోగము నవలంబించెను- ౧౬ సంవత్సరములపిమ్మట స్వయముగా విష్వక్సేనులవారిచేతనే యనేకరహస్యముల నుపదేశము నొందిరి.

౬- (కుముదాంశాసంభూతులగు) మధురకవియాళ్వారులు, కలియుగమునకు ముందు(౧_౨౧)సంవత్సరమగు ఈశ్వరనామసంవత్సరమున బ్రాహ్మణతలిదండ్రులకు జన్మించిరి.

౭- (కౌస్తుభాంశాసంభూతులగు) కులశేఖరాళ్వారులు, కలియొక్క ౨౭ సంవత్సరమున క్షత్రియకులంబునజన్మించిరి.

౮- (గరుడాంశాసంభూతులగు) పెరియాళ్వారులు శ్రీరంగనాయకులవారికి మామగారైరి- ఈయనకూతురు (తమిళ్ యందుఆండాళ్ అను) సుప్రసిద్ధమైన రంగనాయికఈయమ గొప్పవైష్ణవభక్తురాలు

౯- (వనమాలాంశాసంభూతులైన) తొండరడిప్పొడి యాళ్వారులు, కలియొక్క ౨౯౯ సంవత్సరమున బ్రాహ్మణతలిదండ్రులకు జన్మించిరి.

౧౦- శ్రీవత్సాంశాసంభూతులైన తిరుప్పాణియాళ్వారులు కలియొక్క ౩౪౩-వ సంవత్సరమున యవతరించిరి.

౧౧- (శార్ఙ్గాంశాసంభూతులైన) తిరుమంగయాళ్వారులు కలియొక్క ౩౯౮-వ సంవత్సరమున యవతరించిరి. మొదటనీయన యొకచోరుడుగానుండెను గాని తరువాతను పట్టుదలగలిగినట్టియు, పశ్చాత్తాపమునొందినట్టియు భక్తుడయ్యెను.

పే॥ ౬౩ వైష్ణవులనుపదము సామాన్యమైనదై యీక్రిందఁజెప్పువారికిని వర్తించును.

౧- శ్రీవైష్ణవులు- శ్రీరామానుజాచార్యులవారి మతానలంబులు

౨- రామానందులు. (షుమారు క్రీ-శ-౧౨౦౦) రామానందుని యొక్కమతావలంబులు. వీరురామారాధనపరులు- ఉత్తరహిందూస్తానమందు (గాన్పింతురు)

వ్యతిరేకముగా నుండని భాగములు ప్రామాణికములుగా నెంచబడవచ్చు ననియును జెప్పిరి ఈకాలపువారు వానికిగూడ నంతగాయవయవార్థ ములనుమాత్రమే చెప్పునప్పటికిని అంతరార్థమును వెదకువారికి గావ లసి యమూల్యాంశయములతో నీయాగములు గూడియుండును

ప్ర॥ ౭౮ అచిత్తు, చిత్తును ఈశ్వరునియొక్క శరీరముగా (విడదీ యనశక్యముగానుండునట్లుగలుసుకొన్న=అపృథక్సిద్ధముగా) నున్నవని చెప్పునట్టి (వాక్యములు) భాగములేవనగా—

బృహదారణ్యకోపనిషత్తు ౫-వ అధ్యాయము, ౭-వ బ్రాహ్మ ణమును, సుబాలోపనిషత్తును,

౨ అచిత్తు, చిత్తు, ఈశ్వరుడును భిన్నతత్వములని దెలుపునట్టి వియేవనగా—

| | | | | |
|---|---|---|---|---|
| తైత్తిరీయోపనిషత్తు, ఆనందవల్లి. | | ౧అను వాకము | ౧-వ | శ్లోకము |
| డిటో | ... | డిటో ౫ | ౧-౨ | డిటో |
| డిటో | ... | డిటో ౬ | ౨-వ | డిటో |
| డిటో | ... | భృగువల్లి ౧ మొదలు ౬ వరకునుండు అను వాకములు. | | |
| డిటో | | నారాయణము ౧ | ౧ మొదలు ౪ వరకు. | |
| ముండకోపనిషత్తు | | ౩ వ ముండకము ౧ | మొదలు ౩ వరకునుండునవి. | |
| డిటో | ... | ౭-వ ఖాండా | ౬ డిటో. | |
| శ్వేతాశ్వతరోపనిషత్తు | | ౧-వ అధ్యాయము, | ౬, ౯, ౧౦ | డిటో |
| డిటో | | ౪ టోడి | ౫, ౬, ౭, ౯, | డిటో |
| డిటో | | ౬ డిటో | ౧౩-౧౬ | డిటో |
| భగవద్గీతా | | ౭ డిటో | ౪, ౫ | డిటో |
| డిటో | | ౯ డిటో | ౮ | డిటో |
| ... | | ౧౩ | ౧౯ | మొదలు ౨౨వరకు. |

౩ అద్వైతానుగుణ్యముగానుండు (ఏకత్వమునుగూర్చి) భాగము లేవ గా—

కఠోపనిషత్తు ౪-వ వల్లి ౧౦, ౧౧—

ఛాందోగ్యోపనిషత్తు 3-వ ప్రపాఠకము ౪-వ ఖండము (సర్వంఖల్విదం బ్రహ్మ)

డిటో ౬ ౨ (ఏకమేవాద్వితీయం)

... ... ౮ మొదలు ౧౬ వరకు (తత్వమసి)

... ౭ ౨౫ (ఆత్మైవేదంసర్వం)

బృహదారణ్యకోపనిషత్తు ౬ అధ్యాయము ౮ శ్లోకము (నేహనానాస్తికించన)

ఈప్రమాణములు అనేకములుండగా కొన్నిమాత్రమే యిచ్చట సాదృశ్యముగా జూపఁబడినవి.

ప్ర॥ ౧౪ పరవిగ్రహం- ఈయవస్థయందు (విగ్రహమందు) విష్ణువుచే ధరింపఁబడిన యాయుధములు ఈయుదహరింపఁబోవు వాని చిహ్నములుగానుండును. ఖడ్గము జ్ఞానశక్తిని, పద్మము తానుప్రభువగు జగత్తును, చక్రము అజ్ఞానముదొలఁగింపఁ బడఁదగుసాధనమును, శంఖము సమస్తపాపములు దొలఁగింపఁబడగల యీశ్వరశక్తిని విల్లుఁగ వేదెలుపును. పరబ్రహ్మముయొక్క నిత్యవిగ్రహమునకు నిబడిన పేరు- వాసుదేవ.

౨ వ్యూహవిగ్రహము- ఈవిగ్రహము యొక్క ఉద్దేశము, విశ్వముయొక్క సృష్టి. స్థితి, సంహారకార్యములను జూచుటయు, బద్ధులగుజీవులగు తటస్థమగునాపదలను, దొలఁగించుటయు ఉపాసకులయొక్కయుపాసనను సులభముగా జరుగునటులఁ జేయుటయునై యున్నది. పైనఁజెప్పిన రెండువిగ్రహములు నీయంశమున వేరైయుండును. ముందు జెప్పిన వాసుదేవవిగ్రహము షడ్గుణములన్నిటిని గలిగియుండును. (౧౧॥ ప్రచూచునది) రెండవదగు వ్యూహవిగ్రహమున రెండుగుణములుమాత్రమేయుండును. ఇట్లుజ్ఞాన, బలములుగల సంకర్షణుడు లోకమునకు సత్యమునుబోధించుచు- మహాకల్పాంతమందు జగత్సంహారకార్యమును జేయును. ఈయనజీవులపై నధిష్ఠాత (విమర్శించు దైవము) ప్రద్యుమ్న- ఐశ్వర్య వీర్యములతోఁగూడిన ప్రద్యుమ్నుడు లోకమునకుధర్మముఁ బోధించుచు, సమస్తనిర్మల పదార్థములను (శుద్ధసర్గమును) నాలుగువర్ణములను సృజించుచు. ఈయనమనస్సునకు అధిష్ఠాత- అనిరుద్ధ- శక్తి తేజస్సులతోఁగూడిన అనిరుద్ధుడు లోకమునకు జ్ఞానమునొసం

గుచునుండును. ఈయనజగత్తునకు రక్షకుడును, మిశ్రసృష్టికినధిపతియు నైయుండును.

3- విభవ- మనగానొకసదృశరూపమునొందుట, లేకయవతారమని యర్థమిచ్చును ఇదిరెండువిధములైయుండును.- సామాన్యముగా నీశ్వరశక్తిని గలిగియుండునట్టి అంశావతారమును- నరియైన నావిర్భావముగు సాక్షాదవతారమును. పైనజెప్పినదానిలోనికి పదియవతారములును వచ్చును

4 అర్చ్యయనగా చరము లేక ప్రతిమయని ఎక్కువసరిగానుబహుశః సదృశమనియు నర్థమిచ్చును. ఆగమములందలి నిర్వచనమును శబ్దార్థముగా భాషాంతరీకరణము జేయునపుడిట్లుఅర్థమిచ్చును.

సామాన్యముగ, మానవాకారముగా నేర్పరచబడినదియును, ఉపనిషత్తులయందు విధింపబడినయట్లు, ఏక సర్వమునుగూర్చి ధ్యానించుటకొరకు, నొకనికి (అర్చకునికి) నగత్యమైయుండు మనోస్థైర్యము నొందుటకు నర్చకునికి సహాయార్థముగా. విద్యాప్రవీణులచే ననగామహాఉపదేశకులయొక్క యిచ్ఛాశక్తిచేత నొకయాత్మయశక్తిగాని శక్తులుగాని జేరియుండులాగున నేర్పరుపబడి యుండునట్టియు నగునొకదారుమయము లేక శిలామయమునగు పదార్థమైయుండు.

దీనియందు నధికప్రబలమైన గుణము లేవియనగా —

(అ) రుచిజనకత్వ- ఏదేనియొకయాకారము నర్చింపవలెనను నొకయాత్మేచ్ఛను భక్తులయొక్క మనస్సునందు బుట్టించునది రుచిజనకత్వము-

(ఆ) శుభాశ్రయత్వ- ఆయాకారవీక్షణచే నొకసంతుష్టభావమును వారిమనస్సులందు జనింపజేయునట్టిది శుభాశ్రయత్వము.

(ఇ) అశేషలోకశరణ్యత్వ. ఆయాకారము నర్చించుటకు సందరిజనులను ఆకర్షించునట్టిది. అశేషలోకశరణ్యత్వము

(ఈ) అనుభవత్వ- సులభముగామనస్సును నిలుపదగినసమర్థత. అనుభవత్వ.

5 అంతర్యామి- ఇదిహృదయకమల మందునుండునట్లుశ్రేష్ఠాద్వైతులచే దలపబడును. ఈ అంతర్యామి బుద్ధిని కట్టుబాటులోనుంచును. మరియు నీలతోయముచేనావరింపబడిన (కాంతిప్రవాహము) విద్యు

ల్లేఖాసదృశముగా వర్ణింపబడియున్నది. ఇది వేదవచనముయొక్క శబ్దార్థమగు ఛాయగాయున్నది. "నీలతోయదమధ్యస్థవిద్యుల్లేఖేవభాస్వర" దీనినిజమగునర్థము. శ్రీరామానుజాచార్యులవారి వేదాంత సంగ్రహముయొక్క భాష్యకారుని చేత ఉపదేశముతో సంబంధించిన యంశముగ దలపబడియున్నది.

ప్ర॥ ౯౨ మహత్తనగ సాంఖ్యమందువలె బుద్ధియని యర్థమీయదు. కాని యంతకంటె మంచిపేరు దొరకమిచేత నాశబ్దమిచట బ్రయోగింపబడినది. ఇంకా సాంఖ్యమందునది జ్ఞానవికాసమైన్నట్టుగ మహత్తు అధ్యవసాయం లేక బుద్ధియనికాదు. గాని యీవిశిష్టాద్వైత సిద్ధాంతమందు మహత్తనగ ప్రకృతియొక్క వికాసమును, జ్ఞానము జీవునియొక్క గుణమునై వున్నది అహంకారము సాంఖ్యసిద్ధాంతము నందువలె ఆత్మాభిమానము (మమత) అనిఅర్థమీయదు. గాని యిక్కడనంతకంటే మంచిశబ్దము దొరకకుండుటచేసి యిట ప్రయోగింపబడెను. అదియితరతత్వశాస్త్రములందువలె అంతఃకరణము లేక అభిమానమని కాని కామ గాని మహత్తు యొకవికాసమైయున్నది మరియును సూక్ష్మభూతములయొక్కయు జ్ఞానేంద్రియములయొక్కయు కారణమైయున్నది ఈతత్వశాస్త్రమందు మనస్సు, సాంఖ్య శాస్త్రములోని దానివంటిగాదు, గానియది (అంతరేంద్రియము) ఆరవజ్ఞానేంద్రియమైయున్నది. దీనిసహాయముచే నాత్మయందుసమస్తవిధజ్ఞానమునుగలుగుచున్నది. ఇంకను నదియైదుజ్ఞానేంద్రియములతో బాటుగా హృదయ మధ్యమందుండిన యొకయణువుగా నెంచబడును, వీని(ఇంద్రియముల) వృత్తులు హృదయమునుచి జ్ఞానేంద్రియానయవముల వద్దకు వాని నాడులద్వారా గొనిపోబడును.

ప్ర॥ ౧౦౧ జీవాత్మయొక్క స్థానము హృదయమందుండును మరియునది యణుమాత్రపరిమితము గలదైయుండును. గాని గుణమగు జ్ఞానము అపరిమితమై, పలువిధంగులై యుండు నవియేవనిన నూహగ్రహణాదులు. మరియునొకపదార్థమునుగూర్చిన జ్ఞానముగలుగ జేసికొనుటకు సూర్య (కాంతి) ప్రకాశమునుబోలె కాలదేశములనుగూర్చిన యేహద్దును లేక దవ్వునకైనను దూరమునకైనను అది యాపదార్థమువద్దకుబోవును. ఈజ్ఞానము శాశ్వతమును సత్యమునైయున్నది గాని

దాని వికాసములకు నూహాగ్రహణాదులు దమపనికై కొంత యితరస
హాయమునుగోరును ఇట్లు జ్ఞానమే శాశ్వతమైయుండగ దానివికాసము
లు (అవస్థలు) అట్లుకావు.

ప్ర॥ ౧౩౨ నరకము వేదాంతానుగుణముగ నేడువిధములుగా
ని స్మృతులందునది యేడునరకములలో ప్రతిదానికినుత్తమ, మధ్యమ,
అధమములను మూడు విధములగు నంతర్భాగానున్యముగ ఇరువది
యొక్క విధముగ నుండును. యజుర్వేద . అరణ్యకమందు మొదటిప్ర
పాటకమందు అదినల విధంబులనియు, జగముయొక్క నాలుగుకోణ
ములందు నున్నవనియు జెప్పబడియున్నది- భాగవతమునందు నింకనిత
రపురాణములందును, అవి యిరువది యెనిమిదియనియు భూమికిచేరువుగా
నుండుననియు చెప్పబడియున్నది. ప్రతికోణమందు నేడుచొప్పున ఆకా
శపదార్థఅవస్థయందుండు స్థలముయొక్క హద్దులలోనుండినట్లు తలం
చబడును- ఇట్లవియన్నియు నికవది యెనిదియన్నను-

ప్ర॥ ౧౪౩ బ్రహ్మాండములనగా జగత్తులని అర్థమిచ్చును- అవి
యిప్పటిశాస్త్రప్రకాశముచేత సూర్యమాలికలు(సూర్యమండలములు)
గణించబడగలవు. సప్తావరణలు ఆకాశాత్మికములునై యుండును.

ప్ర॥ ౧౪౫ స్థూలప్రపంచము(భౌతికవిశ్వము) దిగువన్నివైపు
లయందు అపారముగ నున్నదనియు, గానియూర్ధ్వంబున శుద్ధసత్వలో
కంబుచేత పారముగలిగియున్నదనియు, ఈశుద్ధసత్వలోకముదిగువ
స్థూలప్రపంచముచేత పారముగలిగినను తదితరపార్శ్వములందన్నిటియం
దపారమైయున్నదనియు జెప్పబడియున్నది. శుద్ధత్వమునకైకుంఠలో
కముయొక్కయు, ముక్తులయు, నీశ్వరునియు శరీరములయొక్కయు
పదార్థముగనుండును- భూతపదార్థమును, శుద్ధసత్వమును ఏకపదార్థము
గానవగ ప్రకృతిగ నెంచబడియున్నది మరియునది సర్వవ్యాపకమును,
అపారమునై యుండినట్లు జెప్పబడియున్నది- విశిష్టాద్వైతులలో గొం
దఱ, శుద్ధసత్వము నొకద్రవ్యమగుటచే నొకవిధమైన ప్రకృతియనియు,
రజస్సుతమస్సులతో జేరక సత్వగుణముమాత్రమే గలిగియుండుననికి
యు నభిప్రాయముగలవారు-

ప్ర॥ ౧౬౪ ద్వారములనగా మార్గము లిరువదిరగునై యుండు
ను- ఏవనగ దేవయానము(అర్చిరాదిమార్గము)పితృయానము(ధూమా

దిమార్గము) ఈ రెండుమార్గములు ఉపనిషత్తులయందును, భగవద్గీత యందును, బ్రహ్మసూత్రములందును వివరింపబడియున్నది- పితృయానమనగ స్వర్గమును బ్రవేశించుటకు నర్హతగలిగి దానినొందిన జనులువెళ్ళునటువంటిమార్గము. స్వర్గానుభవముగలిగించిన కర్మపరిసమాప్తము కాగానే వారీలోకమునకు తిరుగ వత్తురు

ప॥ ౧౬౭, ౧౬౮ కర్మయోగము జ్ఞానయోగము భగవద్గీతయందు-౨-వ- అధ్యాయము మొదలు౬, వరకు)వివరింపబడియున్నది- కర్మయోగము వేదమంత్రముల చేతను బ్రాహ్మణములచేతను ధర్మశాస్త్రముల (స్మృతుల చేతను, ప్రతిపాదింపబడుచున్నది.

ప్ర॥ ౧౬౯ భగవద్గీత (అధ్యాయము ౭ మొదలు౧౨వరకు) ఇంకను బ్రహ్మసూత్రములయొక్క ౩వ అధ్యాయమును శాండిల్యసూత్రములును భక్తియోగమును వివరించును. భక్తియోగము దుష్కర్మయొక్క వినాశనముకు గాను మనోపరిశుద్ధతకుగాను కర్మయోగమునుగోరును.

ప్ర॥ ౧౭౭ ప్రపత్తిశ్రీభాష్యమందును శ్రీరామానుజాచార్యులవారియొక్క యితరగ్రంథములయందును స్పష్టముగ నుదహరింపబడియుండలేదు. గాని తన్మతావలంబకులు (శ్రీరామానుజమతస్థులు) సామాన్యముగ దానినంగీకరింతురు. అది పంచరాత్రాగమములందును ఇంకను శ్రీవైష్ణవులయొక్క యితర పరిశుద్ధ లేఖనములందును రహస్యములందును బహుసూక్ష్మముగ (వివరముగ వివరింపబడియున్నది. శ్రీవైష్ణవులందరును పూర్తుముగ దానినే యాధారముగా జేసికొనియున్నారు గాన నీగ్రంథమందు చెప్పబడినది శ్రీరామానుజులవారు శరణాగతిగద్యనొసర్చిరి (శ్రీ)(శ్రీ)(శ్రీ)

అనుబంధము.

## (శ్రీ) వేదాంతాచార్యులు వారు.

ఈ వేదాంత లేఖనకర్త కాంచీపురంబున కలియుగ ౪౩౭౧ యగు శుక్ల సంవత్సరమునకుసరియగు (క్రీ-౧౨౭౦) సం॥ ముందు సెప్టెంబరునెలలో శ్రవణనక్షత్రమున జనన మొందిరి. విశ్వామిత్రగోత్రముయొక్క యజుర్వేదిని ఆపస్తంబసూత్రముగల ఈయనతండ్రి అనంతాచార్యులు తనకుమారునిబుద్ధికుశలతనుగూర్చి యాలోచించి ఆయనకు బా

గుగ విద్యజెప్పించెను. ఆయనవిద్య నానావిధములైనదిగను విశేషవ్యాపకమైనదిగనునైయుండెను. మరియునీయన తనకాలమువారిలో ప్రబలపండితుడుగ నెంచబడెను.(మంత్రధ్యానముచేసంపాదించినఆత్మశక్తి) మంత్రసిద్ధి ఆయనకుగలదను సంగతినిబట్టి నిరూపింపదగుటచేత నీయన అంతరార్థజ్ఞానియనిగూడ నైయుండెను. ఇవన్నియు గలసి ఆయనకు సర్వతంత్రస్వతంత్రుడను బిరుదునుగలుగజేసెను అనగ సర్వవిద్యలందును (శిల్పము) శాస్త్రములందును ప్రవీణుడు. ఇదియిట్లుండగ విష్ణుచిహ్నమగు ఘంటావతారమని దలంచబడెను. ఆయన మొదటిపేరు వరదాచార్యులు. గాని వేదాంతాచార్యులనుపేరు ఆయన చేసిన వేదాంత విషయకగ్రంథములనుబట్టి ఆయనకు తరువాత నీయబడెను. ఇతరాంశములమీదివిగాక మొత్తమంతయు ౧౧౭ వరకు సంఖ్యతేలిన ఆయన చేసిన వేదాంతగ్రంథములనుబట్టి ఆయనకునాపేరునీయబడెను.

ఆయనగ్రంథములలోమిగులముఖ్యములగువానిలోగొన్ని యేవనిన—

౧ గీతార్థసంగ్రహరక్ష ౨౮౦౦౦ గ్రంథముగల భగవద్గీతపై వివరములతోగూడినభాష్యము.

౨ న్యాయసిద్ధాంజనము 3 న్యాయపరిశుద్ధి ౪-౫ తత్వముక్తాకలాపము దానిభాష్యము సర్వార్థసిద్ధి ౬ అధికరణసరువళి.

ఇవిబ్రహ్మసూత్రములపైనగాని లేక శ్రీరామానుజాచార్యులవారి శ్రీభాష్యముపై వ్యాఖ్యానములుగానియైయుండును.

౭ ఈశావాస్యోపనిషత్తుపైని యొకభాష్యము ౮ సేశ్వరమీమాంసా ౯ మీమాంసపాదుకా.

జైమినిమీమాంససూత్రములపైని భాష్యము. పైగ్రంథము ఆస్తికమతబోధకము.

౧౦ పాంచరాత్రరక్ష-వేదములతో పాంచరాత్రాగమములకు గల సంబంధముగలది

౧౧ శతదూషణి అద్వైతసిద్ధాంతఖండన

౧౨ శిల్పార్థసారము- శిల్పరహస్యార్థముపైగ్రంథము. ఈగ్రంథము దరిమిలాగ్రంథకర్తలచే నుదహరింప (ప్రమాణముగ నంగీకరించ) బడుచువచ్చెను గాని యిప్పటికి నొకప్రతియైనను ఉన్నట్టు గాన్పించదు.

ఈయనదక్షిణహిందూస్థానమునం దనేకదివ్యస్థలములకు యాత్రగ వెళ్ళెనుగాని చివరకు గూడలూరుసమీపమునసుంప అహీంద్రపురమందు నివసించిరి. ఇక్కడ వివిధములగు హిందూతత్వశాస్త్రములపై బాహాటముగ నుపన్యాసములనిచ్చుచుండెను. ఇంకా ఆయన ద్వయ, చరమశ్లోక, అష్టాక్షరియను రహస్యత్రయసారము ఇటువంటి నితరగ్రంధములను బోలినవాని ననేకముగ తమిళ్ భాషయందు జేసెను. ఈగ్రంధకర్తయందుగల జనప్రీతి వేరువేరుఅంతరములుగనుండు బుద్ధి, పరిజ్ఞానముగల జనులకు దగినట్లుగ ఆయనరచించిన వివిధగ్రంధములచే గలిగినది. ఈయనషుమారు నూరుసంవత్సరములు బ్రతికెను. ఈయన తరువాత నారాయణాచార్యులను ఈయనకుమారుడు వేదాంతబోధకుడగనేర్పడి తనతండ్రిగారు జేసిన గ్రంధములకు భాష్యము జేసెను.

## శ్రీమనవాళమహామునులు.

ఈ వేదాంతశాస్త్రజ్ఞులు-కలియుగమున ౪౫... సంవత్సరమున మూలానక్షత్రమందవతరించిరి. (ఇందుకుసరియగు) నాంగ్లేయ తేది- అ[illegible]బరునెల. ) ఈయనయు యజుర్వేదియు నాపస్తంబసూత్రులునై యుండిరి- ఈయనగృహస్థాశ్రమము నవలంబించి శీఘ్రకాలములోనే దానినివిడిచియతియై, (మధురజిల్లాయందలి) రామనాధసమీపమందలి కుంతెనగరమను తనగ్రామమును విడిచి తిరునల్వేలీ మండలములోని అళ్వారు తిరునగరిసమీపమున తనజీవితకాలములో చాలకాలముగడపి, తరువాత శ్రీరంగమునందు శ్రీరంగనాధాలయములో (బోధించుచు)మతవిషయకోపన్యాసముల నిచ్చుచునుండిరి- విశిష్టాద్వైత మతసిద్ధాంతములను ఆయన బహు విరళముగ బోధించుచుండుటజేసి విశేష ప్రజారంజక బోధకులగుటకు చిత్రముగ దగినవారై యుండిరి. మరియు అందుకు దగువిధముగ శీఘ్రకాలములోనే యనేకశిష్యులు నేర్పడగలిగెను. ఆయన జెప్పినయర్థవివరములు ద్రావిడభాషయందు జెప్పబడుటచేత జనులువెంటనె (సులభముగ) గ్రహించుచుండిరిగాన యీయన శిష్యులంతకంత నసంఖ్యాకములుగ నేర్పడిరి. ఈయన షుమారు ౭౦ సంవత్సరములు జీవించిరి. ఈయన నూతనసిద్ధాంతములనేమియు నేర్పరచలేదుగాని, తత్వత్రయము, శ్రీవచనభూషణము, దివ్యప్ర

బంధ రహస్యములువంటి లోకాచార్యులవారి (పిళ్ళైలోకాచార్యులు) గ్రంథములపై కేవలము భాష్యములను జేసిరి మరియునీయన, (వడగలులను) వ్యతిరేక (ప్రతికక్ష) శాఖవారియెడల నెవిధమైన యసూయనుగలిగినట్లునుగాన్పించదు ఇంకను వేదాంతాచార్యులవారి యనేక గ్రంథములలోనుంచి తాము జెప్పినవానికి ప్రమాణములుగ చూపుచునచ్చిరి కాబట్టి వడగలవారు శ్రీమనవాళమహామునులపై విరోధముగ గనుపరచెడు నసూయపూర్ణముగ నన్యాయమైయుండును. తమ ప్రతికక్షను దూషించదలంచియుండిరేని, వేదాంతాచార్యులవారియొక్క సమకాలీనుడును, బంధువుడునునగు (పిళ్లై) లోకాచార్యులవారి యెడ నసూయగలిగి యుండవలసినది. ఈలోకాచార్యులవారు వేదాంతాచార్యులవారి మతమునుంచి చాలాసారము భేదాభిప్రాయముగలిగినట్టియు చాలామట్టుకు వేదాంతాచార్యులవారి గ్రంథములలో కఠినముగానుండునంతగా తప్పులగనుపరచినట్టియు లోకాచార్యులవారి యెడ నసూయపడియుండవలసినది ఈయుదహరింపబోవునవి పరిభాష దెలియబడునంశములు. అనగా తెంగల శ్రీవైష్ణవులు వడగలశ్రీవైష్ణవులనుంచి భేదముగా నెంచునవి అష్టాదశాంశములు. ౧౮. అంశములు. తెంగలవారు అంగీకరించునవి యేవనగా.

౧ ఈశ్వరునికృప, ఎవనియొక్కగాని సుకర్మచేతనుగాక, మరియే కారణముచేతనుగాక నిర్హేతుకముగా నొకనిపై రావచ్చును.

౨ మోక్షమనబడు చివరిపర్యవసానము ఈశ్వరునికిగాక మనకొరకుగాదు.

3 ప్రపత్తిగాక మోక్షమునుసంపాదించుకొనుమార్గములు మరినాలుగుగలవు- అవియేవనగా, కర్మయోగము భక్తియోగము, జ్ఞానయోగము, ఆచారనిష్ఠ (తనయాచార్యునియర్చించుట);

౪ లక్ష్మియునొక జీవియైయున్నది. కావునఆమెసర్వవ్యాపిగాక యణుమాత్రస్థితియందేయుండును.

౫ మోక్షసంపాదన విషయమై ధ్యానించుట కావశ్యములగు విశేషణములను గుణములను లక్ష్మిగలియుండదేమ అటువంటిలక్షణములు గుణములన్నియు, నీశ్వరునికి మాత్రమే చెందును.

౬ వాత్సల్యశబ్దనిర్వచనము ఒకదయాపాత్రుని దప్పులమన్నిం
ఈశ్వరుడు తనకుశరణుజొచ్చిన వారితప్పులనేని పాపములనేని
దోషభోగ్యత) క్షమించును

౭ దయయనగా జీవులనుజూచి వారితో కూడా తానును ఈశ్వరు
విచారముజెందుటయని సరిగానర్థమిచ్చును.

౮ ప్రపత్తి భక్తివలె మోక్షమునకు సాధనముకాదు భగవం
డె ఉపాయమని తలంచెడి ప్రపన్నునియొక్క స్వభావవిశేషము.

౯ ప్రపత్తికి అకించనుడనగ ఏమియులేనివాడె అధికారియను
నియమము లేదు. స్వరూపయాథాత్మ్యజ్ఞానము కలవాడెల్లనధికారియే.
స్వరూపయాథాత్మ్యజ్ఞానమనగ తానుభగవంతునకు శేషభూతుడనియు
స్వ పరతంత్రుడనియును తెలిసికొనుట.

౧౦ ప్రపత్తికొరకుగాను సమస్తవిధులుత్యజించవలెను.

౧౧ పగచేతకాని యహంకారముచేతకాని యేయుపాసనయు
జేయగూడదు.

౧౨ ఐహికజీవనార్థమై కొన్నివిధులు ఒకనిశక్తికొలదిని నిర్వర్తిం
పబడవలెను.

౧౩ ప్రపత్తియొక్క ప్రారంభమందలి మొదటిసాధనములు దాని
నవలంబించి వానిచేజరుపబడగూడదు.

౧౪ మోక్షకారణము ప్రపత్తికాదుగాని యీశ్వరుడు.

౧౫ ప్రపత్తి నవలంబించిన వానిచేదెలిసియు జేయబడినదోషముల
కు ప్రాయశ్చిత్తమనవసరమైయుండును. మునుపుతాను చేసిన ప్రపత్తి
ని దలచుకొనుటయే.

౧౬ శూద్రుడుగజన్మించినను భగవత్కార్యములయందు తనను
ప్రయోగించుకొనునేని, యతడు బ్రాహ్మణునికంటే శ్రేష్ఠుడు. అతడుభ
గవద్భక్తుల సేవకునుపయోగపడదగు

౧౭ జీవుడుఅణుమాత్రమైనను ఈశ్వరుడు దానికినంతర్వ్యా
పించియుండును. చుట

౧౮ కైవల్యము నిత్యము. కాబట్టి కైవల్యమును బొందినవాడతి
గసంసారములోనికిరాడు. ఆకైవల్యము విరజానదికి అత్తలనెయు
కైవల్యము ననుభవించువానికి పరమపదముకలుగదు. సు

ఆళ్వారెంబెరుమానార్ జీయర్ తిరువడిఘళే శరణం.

---

